5.11.1993 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 64, సంచిక: 45, విడిప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు



### ఎప్పటి ఎన్నికలకో ఇరు పక్షాలూ

# ఇప్పుడే కత్తులు నూరుతున్నాయి!

రాజమండ్రిలో జరిగిన తెలుగుదేశం ఛార్జిషీటు సదస్సులో రాష్ట్ర ప్రభుత్వం పై ఆరోపణల జోరుతో గోదావరి తీరం దద్దరిల్లగా, రాష్ట్రావతరణ దినోత్సవం సందర్భంగా సర్కారు వారి సారథ్యంలో ఏర్పాటైన "కోట్ల వారి షో" లో ప్రశంసల హోరుతో రాజధాని మార్మోగింది. కేవలం ఒక్క రోజు తేడాతో జరిగిన రేశం, కాంగ్రెస్ సభలు బలాబలాల

అన్నట్లు తెలుగుదేశం ఆరోపణలు, ముఖ్యమంత్రి వరాలు రెండూ పాత చింతకాయ పచ్చళ్లే కావడం వల్ల రెండు సభలు సాధించింది గుండు సున్నా. కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన నాలుగేళ్ల నుంచి చేస్తూ వచ్చిన ఆరోపణల్నే తెలుగుదేశం గుదిగుచ్చి ఛార్జిషీటును తయారు చేయటంతో అందులో పసలేకుండా పోయింది. మీ ప్రభుత్వానికి అధికారంలో కొనసాగే

నాయకులు విస్మరించటం శోచనీయం. ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఎన్టీఆర్ పై ద్రోణంరాజు చేసిన అవినీతి అభియోగాలు ఏడింట్లో ప్రాథమిక సాక్ష్యాలున్నట్లు హైకోర్టు ధ్రువీకరించగా తెలుగుదేశం నేతకు చీమ కుట్టినట్లు కూడా అన్పించలేదు. అందువల్లనే తెలుగుదేశం ఛార్జిషీటు విషయాన్ని ఎవరూ సీరియస్‌గా తీసుకోవటం లేదు. కాకపోతే ఛార్జిషీటు పేరుతో రామారావు రాజమండ్రిలో

వాదించిన చంద్రబాబు నాయుడు వంటి వాళ్ల నోరు మూయించ గలిగారు. అధికారానికి దూరమై అల్లాడుతున్న తమ్ముళ్లకు సహజంగానే రాజమండ్రి సదస్సు ఊరట కలిగించింది. మరో ఏడాది పాటు వేచివుంటే అధికారం మనదే అన్న భావం తెలుగుదేశం నాయకుల్లో బలంగా నాటుక పోవటానికి ఈ సదస్సు ఉపకరించింది.

నిల్వ వుంచితే ఆయా మార్కెటింగ్ కమిటీలు సదరు సరుకు విలువ మొత్తంలో 75 శాతం మొత్తాన్ని రైతులకు చెల్లిస్తాయి. దీన్ని ముఖ్యమంత్రి తన బుర్రలో నుంచి వచ్చిన సరికొత్త పథకంగా ప్రకటించడం ఆశ్చర్యం కలిగించింది. అలాగే బీడీ కార్మికుల ఇళ్లు కూడా పాతవే. రైతుల కోసం ఏర్పాటు చేస్తానన్న వ్యవసాయాభివృద్ధి సంస్థ గతంలో వుండేది. తెలుగుదేశం దాన్ని



వేదికలుగా ఎన్నికల వాతావరణాన్ని గుర్తుకు తెచ్చాయి. సాధారణ ఎన్నికలకు ఇంకా ఏడాది వ్యవధి వున్నా అధికార పక్షం, ప్రతిపక్షం తమ ఆరోపణల అమ్ముల పొదిని సిద్ధం చేసుకొని ఢీ అంటే ఢీ అని కాలు దువ్వుతున్నట్లనిపించింది. తెలుగుదేశం ఛార్జిషీటులో మొత్తం 89 ఆరోపణల్ని రాష్ట్ర ప్రభుత్వం పై సంధించగా, వాటికి విరుగుడుగా ముఖ్యమంత్రి రాష్ట్రావతరణ సందర్భంగా రైతులు, మహిళలు, బలహీన వర్గాల సంక్షేమానికి వరాల వర్షం కురిపించారు. అయితే దొందూ, దొందే

## ఎన్టీఆర్ పెళ్లికి ప్రజామోదమా?

నైతిక హక్కు ఎక్కడుంది అనే మకుటంతో తెలుగుదేశం విడుదల చేసిన ఛార్జిషీటులో నిజాల కంటే కాంగ్రెస్ పై వున్న అక్కసే డామినేట్ చేసింది. ఎటొచ్చీ అత్తా ఒకింటి కోడలే అన్నట్లు తెలుగుదేశం అధికారంలో వున్నప్పుడు బిజెపి కూడా నూరు తప్పులతో ఛార్జిషీటు ప్రవేశ పెట్టింది. అప్పట్లో అధికార మత్తులో వున్న

పెద్ద ఎత్తున జన సమీకరణ చేసి రాష్ట్ర ప్రభుత్వాన్ని జాగ్రత్త అన్నట్లుగా కలవరం కలిగింప చేశాడు. వృద్ధాప్యంలో రెండో పెళ్లి చేసుకున్న దానికి ప్రజాస్పందన ఎలా వుందో రాజమండ్రి సదస్సుతో రామారావు నివృత్తి చేసుకున్నారు. సదస్సుకు హాజరైన జనం రామారావుతో పాటు ఆయన రెండో భార్య లక్ష్మీపార్వతిని

తెలుగుదేశం సదస్సుకు పోటీగా హైదరాబాదులో సర్కారు వారు నిర్వహించిన సభ కూడా విజయవంతమై రాష్ట్ర ప్రభుత్వం పరువు నిలిపింది. అయితే అరవు తెచ్చుకున్న జనం కాబట్టి ముఖ్యమంత్రి ఎన్ని వరాలు ప్రకటించినా సభలో స్పందన లేకుండా పోయింది. ముఖ్యమంత్రి కూడా తెలివిగా కొత్తగా కమిట్మెంట్

## కోట్ల వరాల సభ సూపర్ హిట్!

తెలుగుదేశంకు బిజెపి ఛార్జిషీటు తృణంలా కన్పించింది. మత్తువదిలాక ఇప్పుడు తాము ప్రవేశ పెట్టిన ఛార్జిషీటుకు తలొంచి కాంగ్రెస్ అధికార పీఠం నుంచి తప్పుకోవాలట. బహుశా ఇది పసుపు న్యాయం కావచ్చు. ఒకరి పై బురద చల్లే ముందు తమ పరిస్థితి ఏమిటన్న విషయాన్ని తెలుగుదేశం

కూడా చూడ్డానికి ఎగబడ్డారు. ఎన్టీఆర్‌కు ఈ విషయం ఎంతో తృప్తిని కలిగించింది. తానేమి చేసినా ప్రజామోదం వుంటుందన్న ధీమాను రాజమండ్రి సదస్సు ద్వారా మరో మారు నిరూపించు కున్నాడు. రెండో పెళ్లి వల్ల ఇమేజ్ దెబ్బ తిని పార్టీ ప్రతిష్ట మంట కలిసి పోతుందని

ఏమీ లేకుండా పాత పథకాలకు కొత్త అంగీ తొడిగి గర్వంగా ప్రకటించారు. రైతులకు మార్కెటింగ్ కమిటీలో అప్పులిచ్చే పద్ధతి ఎప్పటి నుంచో వుంది. దాని కోసం రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకంగా నిధులు కేటాయించాల్సిన అవసరం లేదు. రైతులు తమ సరుకుల్ని మార్కెటింగ్ యార్డుల్లో



రద్దు చేసి రాష్ట్ర కర్షక పరిషత్ ఏర్పాటు చేసింది. జనార్దన రెడ్డి హయాంలో రాష్ట్ర కర్షక పరిషత్ రద్దయింది. తిరిగి ఇప్పుడు వ్యవసాయాభివృద్ధి సంస్థను కొత్తగా ఏర్పాటు చేస్తున్నట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు. పాతదాన్ని తిరగ తోడితే కొత్త పథకం అవుతుందా? అలాగే మహిళలకు చౌక దుకాణాలివ్వటం, ఎస్సి, ఎస్టిలకు సౌకర్యాలు ఇవన్నీ ఏడాదిలోగా కలిపిస్తాననడం ఎన్నికల ముందు ఏ ప్రభుత్వమైనా చేసే జిమ్మిక్కే. వరాలు

కొరవ 12 పేజీలో

# జలగం ఒక్కడి పైనే చర్యా ఎందుకు?

మాజీ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళ రావు కుమారుడు సత్తుపల్లి శాసన సభ్యుడు జలగం ప్రసాద్ పై పార్టీ పరంగా క్రమశిక్షణ చర్య తప్పేట్లు లేదు. జలగం ప్రసాద్ పై క్రమశిక్షణ కత్తిని ముఖ్యమంత్రే స్వయంగా నూరుతుండటం వల్ల పాపం పిసిసి అధ్యక్షుడు పట్టి సాహసానికి ఒడిగట్టాల్సి వస్తోంది. సాధారణంగా కాంగ్రెస్ పార్టీలో క్రమశిక్షణ చర్యలు తీసుకోవడం బహు అరుదు. అయితే ముఖ్యమంత్రి వత్తిడి కారణంగా జలగం ప్రసాద్‌కు పిసిసి తరఫున షోకాజ్ నోటీస్ జారీ అయింది. రాష్ట్ర

మంత్రి వర్గ విస్తరణ తర్వాత ముఖ్యమంత్రి పై నేరుగా ధ్వజమెత్తి నందుకు ఈ షోకాజ్ నోటీస్ జారీ

విరందరికంటే మించి లోకసభ సభ్యుడు డాక్టర్ వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి అటు ప్రధానిని, ఇటు ముఖ్యమంత్రిని

చర్చనీయాంశం అయింది. అయితే వై.ఎస్. తన ప్రకటన పై పత్రికల్లో వివరణ ఇచ్చాడని, అలాగే చిత్తరంజన్

> **గుహలో వున్న వృద్ధ సింహం వెంగళరావును గిల్లి రెచ్చగొడుతున్నాడు విజయభాస్కర రెడ్డి!**

చేశారు. అయితే ముఖ్యమంత్రిని నానా మాటలు అన్నది ప్రసాద్ ఒక్కడే కాదు. వంగవీటి చలపతి రావు, చిత్తరంజన్ దాస్ ప్రభృతులున్నారు.

తీవ్ర పదజాలంతో దుయ్యబట్టారు. వీరందరిని విడిచి పెట్టి కేవలం జలగం పైనే చర్య తీసుకోవటంలోని అంతర్యం ఇప్పుడు కాంగ్రెస్ వర్గాల్లో

దాస్ మనసు మార్చుకున్నాడని ముఖ్యమంత్రి సన్నిహిత వర్గాలు సమర్థించు కుంటున్నాయి. ప్రసాద్ జలగం వెంగళ రావు కుమారుడు

కావటం వల్ల కక్ష సాధింపు చర్యకు ముఖ్యమంత్రి ఒడిగడ్తున్నాడని జలగం వర్గీయులు అంటున్నారు. తాను పిసిసి అధ్యక్షుడిగా వుండగా కోట్లకు లోక్ సభ టిక్కెట్టు ఇప్పించానని వెంగళ రావు గారన్నారట. ఇది ఆనోట ఈ నోట నానుతూ ముఖ్యమంత్రి గారి దగ్గరకు వెళ్లింది. దాంతో ఆయన విరాకెత్తి పోతున్నారట. ఏదైతే నేం తన సత్తా చూపించాలని ముఖ్యమంత్రి దృఢ నిర్ణయానికి వచ్చి ఖమ్మం జిల్లా రాజకీయాల పై దృష్టిని కేంద్రీకరించారు. దీంతో రాజకీయాన్ని

కొరవ 12 పేజీలో

# సైన్యం చేతులు కట్టేసి టెర్రరిస్ట్‌ల ఆటలు సాగిస్తున్నారు!

శ్రీనగర్‌లోని హజరత్‌బాల్ దర్గానుంచి తీవ్రవాదులను బయటకు రప్పించడానికి సైన్యం చేస్తున్న ప్రయత్నాలు పూర్తిగా విఫలమౌతున్నాయి. ఇరవై రోజులు దాటిపోయింది; వారింకా లోపలే వున్నారు. తమతోటి దాదాపు 80,90 మంది సాధారణ పౌరులను బందీలుగా పెట్టుకొని వున్నారు.

కాశ్మీర్ సమస్య విషయంలో భారత ప్రభుత్వం ఎటువంటి అసమర్థ విధానాల ననుసరిస్తున్నదీ, పాకిస్తాన్ ముష్కరులు ఎంతగా బరితెగించి ప్రవర్తిస్తున్నదీ తెలుసుకోవడానికి ఈ దర్గా ముట్టడే నిదర్శనం. హజరత్ బల్ దర్గా ముస్లింలకు చాలా పవిత్రమైన ప్రార్థనా స్థలం. అందులో మహమ్మద్ ప్రవక్తకు సంబంధించిన పవిత్ర కేశం వుంది. దాని పవిత్రతకు భంగం కల్గే రీతిలో ఏ మాత్రం ప్రవర్తించినా దేశంలోని ముస్లింల మత నమ్మకాలు, మనోభావాలు ప్రభావితమౌతాయి. పంజాబ్‌లోని స్వర్ణాలయం విషయంలో వేసిన తప్పటడుగుకు దేశం ఎంత మూల్యం చెల్లించిందీ మనకు తెలుసు. ఒక ప్రక్క అయోధ్య బాబ్రీమసీదు సమస్యతోనే తల బొప్పి కడుతున్నది. అటువంటి సమయంలో హజరత్ బాల్ తీవ్రవాదుల స్థావరంగా మారడం ఎంత ప్రమాదకరమైన విషయం? అటువంటి పరిస్థితి రావడానికి ప్రభుత్వ నిర్ణయ వైఖరే కారణం కావడం ఎంత దురదృష్టకరం?

హజరత్ బాల్ దర్గాను ఆనుకొని వున్న కాశ్మీర్ విశ్వ విద్యాలయం, ఇంజనీరింగ్ కాలేజిలలో చాలా కాలం నుంచి మిలిటెంట్లు తల దాచుకొంటున్నారు. ఈ సంగతి ప్రభుత్వానికి తెలుసు కాని జన సాంద్రత అధికమైన నివాస ప్రదేశం కావడంతో సైనిక చర్యకు సాహసించ లేక పోయింది. దానితో తీవ్రవాదులు

> **ఢిల్లీ నేతలు దృఢమైన రాజకీయ నిర్ణయం తీసుకోలేనందువల్లే హాజరత్‌బాల్ ఇంకా మిలిటెంట్ల స్వాధీనంలో వుంది!**

దానిని "విముక్త ప్రదేశంగా" ప్రకటించి తమ స్థావరంగా మార్చుకున్నారు. నెల రోజుల క్రితం హజరత్ బాల్ దర్గాలో ఆయుధ ప్రదర్శన నిర్వహించారు. అందులో తమ దగ్గరున్న రక రకాల అధునాతన ఆయుధాలు ప్రదర్శించి ప్రజలను పిల్చి చూపారు. అయినా ప్రభుత్వం జోక్యం చేసుకోలేదు. సైన్యం వుండ బట్టలేక ఇంజనీరింగ్ కాలేజిలో సోదా జరిపింది. భయంకరమైన మారణాయుధాలు ఎన్నో లభించాయి. ఆ సోదాకు భయపడిన మిలిటెంట్లు భక్తులతో కలిసిపోయి, దర్గాలో తలదాచు కున్నారు. అప్పుడే సైన్యం వారిని చట్టు ముట్టింది. అయితే ఢిల్లీ నుంచి వచ్చిన అత్యవసర ఆదేశాలు పాటించి సైన్యం వెనక్కి తగ్గడంతో మిలిటెంట్లు విజయనాదాలు చేస్తూ బయటకు వచ్చారు. సైన్యం కళ్లముందే వారు పారిపోయారు.

ఈ అలుసు చూసుకొనే మిలిటెంట్లు రెండవ సారి అదే దర్గాలో తిష్ట వేశారు. మొదటి పర్యాయమే, ప్రభుత్వం కఠినంగా వ్యవహరించి వుంటే ఈ పరిస్థితి ఏర్పడేది కాదు. కనీసం తీవ్రవాదుల స్థావరంగా దాన్ని గుర్తించిన తర్వాత అయినా అక్కడికి రాకపోకలను క్రమ బద్ధీకరించి వుంటే ఇంతటి ప్రమాదం కల్గేది కాదు. కాశ్మీర్ విషయంలో కేంద్ర ప్రభుత్వం ఊగిసలాట వైఖరికి ఇది నిదర్శనం. ఒక రోజు సైన్యాన్ని కఠినంగా వ్యవహరించమని ఆదేశిస్తున్నారు: ప్రక్క రోజు కళ్లు మూసుకొని చూస్తూ వూరుకోమని హుకుం జారీ చేస్తున్నారు.

లోపలున్న వారిని సామరస్యంగా బయటకు తేవడం అంత సులువైన పని కాదు. అందులో రాజకీయ వాతావరణం ప్రమాద భరితంగా వున్న సమయమిది. ఒక ప్రక్క ఉత్తర భారతంలో ఎన్నికలు జరుగుతున్నాయి. ఇంకొక ప్రక్క ఐక్యరాజ్య సమితి, కామన్ వెల్త్ దేశాధినేతల సమావేశం జరుగుతున్న సమయం. పాకిస్తాన్‌లో కొత్త ప్రభుత్వ ప్రమాణ స్వీకార తరుణం. ఇన్ని అనుకూలతలుండ బట్టే పాకిస్తాన్‌కు చెందిన ఇంటర్ సర్వీసెస్ ఇంటలిజెన్స్ సంస్థ ఈ కుట్ర పన్నింది. దర్గా లోపలున్న మిలిటెంట్లలో ఆ సంస్థ గూఢ చారులతో పాటు, ఆఫ్ఘనిస్తాన్, జర్మనీలకు చెందిన కిరాయి హంతకులుండడం ఇక్కడ గమనార్హం. మిలిటెంట్లకు పాకిస్తాన్ అందిస్తున్న సహాయ సహకారాలను దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.


హాజరత్‌బాల్ దర్గా నుంచి చర్చల కోసం [illegible] వస్తున్న ఇద్దరు మిలిటెంట్లు.

కలుగులో దూరిన ఎలుకల్లాగా దర్గా లోపలున్న తీవ్రవాదులను లొంగదీయడానికి సైన్యాన్ని వుపయోగించడం మంచి నిర్ణయమే. దర్గా లోపలకు సైన్యాన్ని పంపకుండా బయట ముట్టడించడమూ సహేతుక నిర్ణయమే. కానీ ఈ పరిస్థితిలోనూ ప్రభుత్వ నిర్ణయాలు నిర్దుష్టంగా లేవు. మిలిటెంట్లతో చర్చలు జరపడానికి ప్రభుత్వం తీవ్రవాద సానుభూతి పరులైన హరియత్ కాన్ఫరెన్స్ నాయకులను పిల్చింది. వారు వచ్చి సమస్యను జటిలం చేసి వెళ్లారు.

కొరవ 7 పేజీలో



# ఉత్తరక్రియలు

నా భార్య

## బత్తెన సుశీలమ్మ

**29.10.93** తేది శుక్రవారం స్వర్గస్తురాలైనది.

ఆమె ఆత్మకు చిరశాంతి కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తూ

**ఆమె కర్మక్రతువులు**

**10.11.93** తేది బుధవారం

నెల్లూరు టౌన్, దర్గామిట్ట, సుజాతమ్మ కాలనీలోని మా స్వగృహమున జరుగును.

బంధుమిత్రులు తెలియ గోరుతాము.

- బత్తెన వెంకట కృష్ణారెడ్డి

కుమారులు: బత్తెన గిరిజాపతి రెడ్డి, బత్తెన ఉమాపతి రెడ్డి

# జమీన్‌రైతు

## అమెరికా దురహంకారం

కాశ్మీర్ విషయంలో అమెరికా ప్రభుత్వం చేసిన ప్రకటనలు వారి దురహంకారాన్ని, దుర్మార్గపు ఆలోచనా తీరులను ప్రతిఫలిస్తున్నాయి. 1947 లో భారత్ యూనియన్‌లో జరిగిన కాశ్మీర్ విలీనం చట్ట బద్ధమైనది కాదని, కాశ్మీర్ ఇప్పటికీ వివాదాస్పద భూభాగమేనని అమెరికా విదేశాంగ శాఖ అసిస్టెంట్ సెక్రటరీ రాబిన్ రాఫెల్ ప్రకటించారు. ఆసియాకు సంబంధించిన విధానాల రూపకల్పనలో ఆమె చాలా కీలకమైన పదవిలో వున్నారు. అటువంటి అధికారిణి, హజ్రత్‌బాల్ దర్గా సమస్యతో భారతదేశం తబ్బిబ్బవుతున్న సమయంలో ఈ ద్రోహ పూరితమైన ప్రకటన చేయడం అమెరికా కుటిలత్వాన్ని బయట పెడుతున్నది. హజ్రత్‌బాల్ సమస్యను మరింత జటిలం చేయాలన్న కుత్సితపు ఆలోచన అందులో కన్పిస్తున్నది.

ఈ ప్రకటన ఖచ్చితంగా భారతదేశ అంతరంగిక వ్యవహారాలలో శత్రుభావ సమన్విత జోక్యమే. కాశ్మీర్ భారత్‌లో అంతర్భాగమని ప్రపంచానికంతటికీ తెలుసు. 1947 లో ఒక్క కాశ్మీరే కాదు - దేశంలోని 450 సంస్థానాలు సర్వసత్తాక భారత గణతంత్ర రాజ్యంలో విలీనమైనాయి. అనాటి బ్రిటీషు గవర్నర్ జనరల్ లార్డ్‌మౌంట్ బాటన్ దీనిని పర్యవేక్షించారు. పాకిస్తాన్ కూడా అప్పుడు దీనిని సమ్మతించింది. మధ్యలో వివాదం రేపినా, స్వర్గీయ జుల్ఫికర్ భుట్టో చరిత్రాత్మక సిమ్లా ఒప్పందం ద్వారా మరొక సారి కాశ్మీర్ పై భారత సార్వభౌమాధికారాన్ని అంగీకరించారు. ఇన్ని సంవత్సరాల తర్వాత అమెరికా దీన్ని ఒక వివాదంగా పరిగణిస్తున్న దంటే, తమ ఆర్థిక -ఆయుధ బలాన్ని బలహీనమైన దేశాల పై ప్రయోగించి, పెత్తనం చెలాయించాలన్న దుర్బుద్ధి తప్ప వేరు కాదు. ఈ ప్రకటన చేసిన రాబిన్ రాఫెల్, కాశ్మీర్ సమస్యను కూలంకషంగా అధ్యయనం చేసిన వ్యక్తి. ఆమె ఢిల్లీలోని అమెరికా రాయబార కార్యాలయంలో రెండేళ్లుండి దీన్ని అధ్యయనం చేశారు. ఇది ఆమె స్వంత అభిప్రాయం కానే కాదు. అమెరికా విదేశాంగ శాఖ కుత్సితపు బుద్ధితో చేయించిన ప్రకటనే ఇది.

ఇరాక్‌తో యుద్ధం, ఇజ్రాయిల్ పట్ల అభిమానాల వంటి వాటి వల్ల ముస్లిం రాజ్యాలలో తరగి పోతున్న తన ప్రతిష్ఠను పెంపొందింప చేసుకోవడానికి అమెరికా చేస్తున్న కుట్ర ఇది. ఈ ప్రకటన ద్వారా పంజాబ్, కాశ్మీర్‌లలో పాకిస్తాన్ సాగిస్తున్న దుర్మార్గాలు, పెంచి పోషిస్తున్న టెర్రరిజం మారణాయుధాల సరఫరాలను వారు సమర్థించి నట్లవుతుంది. కాశ్మీర్‌లో ఇప్పటికే పెట్రేగి పోతున్న తీవ్రవాదులకు నైతిక మద్దతు అందించడ మౌతున్నది. ఈ ప్రకటనతో పాకిస్తాన్ తన విద్రోహ చర్యలను మరింత ముమ్మరం చేసే ప్రమాదం వుంది.

దేశంలోని రాజకీయ వాదులందరూ, పార్టీల కతీతంగా అమెరికా ప్రకటనను విమర్శించారు. దేశ సార్వభౌమత్వానికి ప్రమాదం ఏర్పడినప్పుడు రాజకీయ శక్తులన్నీ సమైక్యం కావడం అత్యంతావశ్యకం. ప్రజలలోనూ దీనిపట్ల తీవ్రమైన ఆగ్రహావేశాలు వ్యక్తమైనాయి. ఈ ప్రతిస్పందనకు జడిసే అమెరికా ప్రభుత్వం మరుసటి రోజు ఒక బలహీనమైన వివరణ ఇచ్చింది. వారు లేవనెత్తిన విషపూరిత సమస్యకది సమాధానం కానే కాదు. భారత ప్రభుత్వం ఈ ప్రకటనను, అమెరికా దురహంకారాన్ని తిరుగులేని రీతిలో ప్రతిఘటించడం అవసరం. ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్ వంటి ఆర్థిక సంస్థల దగ్గర దేహీ అని చేయి చాచ వలసిన దుస్థితిలో వున్న మనల్ని చూసి, అప్పుకోసం వారు పెట్టిన షరతులన్నింటికీ అంగీకరించే మన బలహీనతను కనిపెట్టి అమెరికా ఈ దుర్మార్గానికి పూనుకున్న దన్నది వాస్తవం. ఆర్థిక అభ్యున్నతి కోసం అర్రులు చాస్తున్న భారతదేశాన్ని ఈ సమయంలో అయితేనే చెప్పుక్రింద తేలువలె తొక్కి పెట్ట వచ్చుననే దుర్బుద్ధితో వారు పన్నాగాలు పన్నుతున్నారు. దేశ సార్వభౌమాధికారం, ప్రజల ఆత్మగౌరవం కంటే ఐఎంఎఫ్ విదిల్చే ముష్టి అధికమైనది కాదు. దేశ ఆర్థిక సమస్యలకు ఐఎంఎఫ్ అప్పు ఒక్కటే మార్గాంతరం కాదు. విలువ కట్టలేని, వెలలేని సహజ వనరులున్న దేశం మనది. రాజకీయ పాలనా వ్యవస్థల నుంచి అవినీతిని దూరం చేసి, సమర్థతను పెంచితే ఎవరి అప్పుతోనూ పని లేకుండా అభివృద్ధి చెందగల స్తోమత మనకుంది. ఈ వాస్తవాన్ని మనసులో వుంచుకొని అంతర్జాతీయంగా తానేది చెప్తే అదే శిలాశాసన మన్న దురహంకారంతో వ్యవహరిస్తున్న అమెరికాకు బుద్ధి చెప్పాలి. వారు మరొకసారి మన అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకోను సాహసించని రీతిలో గుణపాఠం నేర్పాలి. భారతజాతి యావత్తూ ముక్తకంఠంతో తమ నిరసనను ప్రతిధ్వనింప జేయాలి. రష్యా పతనంతో తన శక్తికి ఎదురు లేనట్లు ప్రవర్తిస్తున్న అమెరికా తోక కత్తిరించడానికి వర్ధమాన దేశాలను సమైక్య పరచి అంతర్జాతీయ ప్రజాభిప్రాయం రూపొందించ వలసిన బాధ్యత కూడా భారత ప్రభుత్వం పై వుంది. ఇందిరా గాంధీ వంటి నాయకులు బ్రతికి వుంటే ప్రపంచంలో భారతదేశం పరిస్థితి ఇప్పుడెంత వేరుగా వుండేదో!

# జమీన్‌రైతు

5.11.1943

వెల 0-1-6

## మన వార్తలు

గతవారం నెల్లూరులో, జాతీయ బాలసంఘం యేర్పడ్డది. ఆ సంఘంలోని వారందరూ, మన "బాలాభిమన్య" వ్రాసిన "బాల యోధులం" అనే పాటపాడుచూ, ప్రతిరోజూ సాయంత్రం ఆట, పాటలతో, జాతీయతా చింతతో కాలం గడుపుతూ, వాళ్లు డ్రిల్లు నేర్చుకుంటున్నారు. మన జాతీయ నాయకుల జీవిత చరిత్రలను పెద్దలచేత చెప్పించు కుంటూ, రాజకీయ చింతను అలవరచు కుంటున్నారు.

ఈమధ్య (ఇపురుగూడ) నెల్లూరులోని కొబ్బెల కరవు విషయమై, జిల్లా కలెక్టరు వద్దకు జాతీయ యువజన సంఘము, విద్యార్థి సంఘముల, యాజమా న్యమున పౌరుల యాత్రసాగింది. యాత్రలో పాల్గొనమని పౌరులను హెచ్చరించు కరపత్రాలను. 20మంది జాతీయ బాలకులే నెల్లూరు పట్టణ మంతా పంచి పెట్టారు. మరునాడు వారుగూడ యాత్రలో పాల్గొన్నారు. సంఘ సేవలో నిమగ్నులై, సద్గు ణాలను అలవరచుకుంటున్న నెల్లూరు లోని మనమలంటే, ముచ్చట పడకుండా యెట్లావుంటాను? మీరంతా గూడా ఆ విధంగా ప్రజాసేవలో నిమగ్నులు కావాలి.

### టర్కీలో వారం రోజులు

### పిల్లలరాజ్యం

కీ.శే.ముస్తఫా కెమాల్‌పాషా నాయకత్వాన "సిక్‌మేన్ ఆఫ్‌యూరప్" అనే చెడ్డపేరును పోగొట్టుకుని, టర్కీ ప్రపంచమంతటికీ గూడ ఒక విషయంలో మార్గ దర్శకమైంది. గత ప్రపంచ సంగ్రామానంతరం, టర్కీలో అద్వితీయమైన, అమోఘమైన రాజ్యాంగ సంస్కరణలేమి, సాంఘిక సంస్కరణ లేమి, యెన్నో జరిగినాయి. నూతన రాజ్యాంగ చట్టం ప్రకారం, టర్కీ ప్రభుత్వం, సంవత్సరంలో వారం రోజులు పిల్లలచేతనే నడుప బడు

**50 ఏళ్ల క్రితం ఈ వారం**

తుంది. పిల్లలు రాజ్య పరిపాలనా భారం వహించటం, ఒక్క టర్కీలో తప్ప, మరే దేశంలోనూ లేదు. కడకు సోవియట్ రష్యాలో గూడాలేదు. ఆవారం రోజులలో, అన్ని డిపార్టుమెంటుల మీద పిల్లలదే పెత్తనం.

"ప్రతి ఇల్లాలు రాజ్యాంగ యంత్ర నిర్వహణా ప్రవీణురాలు కావాలి" అని లెనిన్ అన్నాడు. "ఇల్లాండ్రేగాదు, పిల్లలు-వీరే భావి పౌరులు కాబట్టి-గూడ రాజ్యాంగ యంత్ర నిర్వహణంలో శిక్షణ, ప్రావీణ్యం, పొందాలి" అని గుర్తించిన కెమాల్‌పాషా, పిల్లలచేత వారం రోజులు టర్కీ పరిపాలన సాగించుట ద్వారా, వారికి పరిపాలనా దక్షత చేకూర్చుటకు పూనినారు. (జవహర్‌లాల్ రచననుసరించి)

### గ్రామసీమలు

#### కందుకూరు బోర్డు ఆఫీసరు

మాకొక స్పెషలాఫీసరున్నారండి! తనకు జోక్యం లేని అనవసర విషయాలలో జోక్యం కలిగించు కుంటారు. ఉపాధ్యాయుడు పేరు భొట్ల సుబ్బరామయ్య యింటికి బాడుగకు యివ్వలేదనే కక్షతో వారికి క్షయవ్యాధి ఉన్నదని డి.యం.ఓ. కు రిపోర్టుచేశారని, డి.యం.ఓ. క్షయలేదు, గియాలేదన్నాడనీ తెలుస్తుంది. ఇవేనటండి పరిపాలనా దక్షులైన ఉద్యోగి కార్యాలు?

-ఓ.వి.

#### రాపూరు బస్

ఈనాడు గూడూరుదారిన ఒకటే బస్. సైదాపురం, వాగణం మధ్యలో మైకాగనుల వారు ఎంతో దూరాన్నుండి వచ్చి కాచుకొని యుంటారు పిల్లలు ఆడవాండ్రు సహా. ఇంతా కాచుకొనియుంటే చివర్న ఎక్కించుకుంటారనే నమ్మకం లేదు. అసలు వారి నిర్ణయమేలేదు. కండక్టరు వారిది సౌమ్యంగా మాట్లాడే నాలుకగా కనుపించదు. సర్వీసువారన్నా ప్రయాణీకుల యిబ్బందులు తీర్చడం అవసరం.

-కాశింసా.

❁❁❁

కొరప 10 పేజీలో

# శ్రీనాథుడి చేత మల్లయుద్ధం - బాపు సినిమాలో వింత పైత్యం!

దర్శకుడు బాపు గారి చిత్రలేఖనా కుంచె ప్రౌఢ శ్రీనాథుడ్ని దృశ్య పరంగా చూపలేక పోయింది. శ్రీనాథుని భార్య అలివేణి హస్త ఆకుపచ్చచిలుకలు నమలుతున్నప్పుడు ముదిమి శ్రీనాథుడు సాక్షాత్కరిస్తాడు. శృంగార నైషధం, హరవిలాసం కావ్యాలలోని ప్రధాన ఘట్టాల చిత్రీకరణ రక్తికట్టలేదు. చారిత్రక పరంగా బమ్మెర పోతన శ్రీరామ భక్తుడు; చిత్రంలో విఠ్ఠారంగా శ్రీనాథ భజన చేస్తుంటాడు. అదే విధంగా శ్రీనాథుని మహా ప్రస్థానం కృష్ణానది జలాల వరకు సాగనంపి అతని బావ మరిది దుగ్గనతో "కాశికా విశ్వేశు కలిసె వేమారెడ్డి" పద్యం పలికించడం ఎంత వరకు సబబు? రామారావు గారు మహా నటులే. ఆయన మేనరిజాన్ని దర్శకుడు చక్క

## జనవాణి

దిద్దక పోవటంతో పలు సన్నివేశాలు రస స్పందన కల్గించక నీరస పడిచాయి. అన్నింటిల్లోనూ వింత శ్రీనాథుని మల్ల యుద్ధ నిపుణుడిగా చూపడమే!

-వేల్పుల కామయ్య

బుచ్చిరెడ్డిపాళెం

### శ్రీనాథుడు చిత్రంలో ఒక సందేహం?

ఎన్టీరామారావు నటించిన శ్రీనాథ కవిసార్వభౌమ చిత్రం చూస్తే పలు సందేహాలు కలుగుతాయి. ఈ చిత్రంలోని ఒక సన్నివేశంలో శ్రీనాథుడు చెప్పె రాజనంద రాజ ధరణీ పతికి భావ భవభోగ సత్కళా

కొరప 10 పేజీలో

## సంస్మరణ

1974సంవత్సరం నవంబరు 11వ తేది మమ్ములనందరినీ దుఃఖసాగరమున ముంచి దివంగతులైన టి.వి.రమణారెడ్డి గారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ-

-కుటుంబ సభ్యులు

# "సోమశిల తేలేని ఎమ్మెల్యేగా సిగ్గుపడుతున్నాను"

## వేసిన రోడ్లు వానకు కొట్టుకు పోతున్నాయి; డ్రైనేజీ పనులూ అధ్వాన్నం; ఇంకేముంది మనం చేసిన జిల్లా అభివృద్ధి?

రాష్ట్రావతరణ దినోత్సవాన్ని పురస్కరించుకొని జిల్లా యంత్రాంగం టౌన్ హాల్లో ఏర్పాటు చేసిన సభలో ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి ఎందువల్లో ఆవేదన భరితంగా ప్రసంగించారు. జిల్లా అభివృద్ధి అన్ని రంగాల్లో జరుగుతున్నదని నివేదికల్లో పూరించ గొప్పేయుతం కాదు; వేసిన రోడ్లు కొద్ది పాటి వర్షానికే కొట్టుక పోతున్నాయి. జిల్లాలో ఇటీవల వేసిన డ్రైనేజీ పనులు అధ్వాన్నంగా జరిగాయని విమర్శించారు. సమగ్ర సోమశిల ప్రాజెక్టును జిల్లా వాసి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు సాధించుకోలేక పోవడం పట్ల ఎమ్మెల్యేలందరూ సిగ్గు పడాలని, ఆ విషయంలో తాను తీవ్ర మనస్తాపానికి లోనయ్యానని చెప్పారు. మొదట ఉపన్యాసం ముగించి కూడా, చివర్న మైకందుకొని ఈ మాటల న్నారాయన. కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు మళ్లీ ఆగస్టు 15, జనవరి 26 తేదీలను గుర్తుతెచ్చే విధంగా అభివృద్ధిని అంకెల రూపంలో వివరించారు. జిల్లాలో 1.5 లక్షల మందికి ఇండ్ల స్థలాలు, 80 వేల మందికి పక్కా గృహాలు, 206 లక్షల వ్యయంతో వ్యవసాయాభివృద్ధి పథకాలు చేపట్టామని పొదుపులక్ష్మి, కుటుంబ సంక్షేమం, నిరక్షరాస్యత నిర్మూలన వల్లే జిల్లా అభివృద్ధి సాధ్యమవు తుందని చెప్పారు కలెక్టర్. ముఖ్య అతిథి డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి ఆంధ్ర రాష్ట్ర అవతరణకు అమరజీవి పొట్టి శ్రీరాములు చేసిన పోరాటాన్ని, తాను, కళా వెంకట్రావు, బూర్గుల రామకృష్ణ రావు పడిన కష్టాలను కళ్లకు కట్టినట్లు వివరించారు. ఉపన్యాసాన్ని శ్రద్ధగా వినమంటూ కలెక్టర్‌ను మాటి మాటికి భుజం పై తట్టి పలు అంశాలు ఆయన నోట్ చేసుకొనేలా చేశారు. పొట్టి శ్రీరాములు చిత్ర పటానికి పూలమాల వేసి జ్యోతి

### జె.కె. ఆవేదన

వెలిగించడంతో పాటు అభివృద్ధి పథంలో నెల్లూరు జిల్లా పుస్తకాన్ని ఆయన విడుదల చేసారు. డి.డి.ఓ. శ్రీ విష్ణు కూడా మాట్లాడారు. చివరన దక్షిణ ప్రాంతీయ సాంస్కృతిక సంఘం (తంజావూరు) సౌజన్యంతో మద్రాస్ మార్షల్ ఆర్ట్స్ వారు ప్రదర్శించిన సాముగరడీ ప్రజలను కార్యక్రమం చివరి వరకు కూర్చోబెట్టింది.

### 'ద్వారం' స్మృతికి నజరానాగా కచ్చేరి!

పండిత పామరులను కళాకారుడు మాత్రమే స్పందింప చేయగలడన్న విషయం 30 తేది టౌన్‌హాలులో జరిగిన సభ నిరూపించింది. వర్తమాన సమాజం ప్రఖ్యాతి గాంచిన వయొలిన్ విద్వాంసులు, ద్వారం వెంకట స్వామి నాయుడు శతజయంతి సందర్భంగా ఏర్పాటు చేసిన సభలో వయొలిన్ కచ్చేరి ప్రేక్షకులను ఆహ్లాద పరిచింది. పట్టుమని పాతికేళ్లు నిండని యువ కళాకారులు శ్రీ రాజన్, వెంకట కృష్ణన్, పినాక పాణి తమ ప్రతిభతో సమ్మోహితులను చేసి చిరు సన్మానం అందుకొన్నారు.

అంతకు ముందు జరిగిన సభను డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి అధ్యక్షించారు. ద్వారం వెంకట స్వామి నాయుడుతో తనకున్న సన్నిహిత సంబంధాలను వివరించారాయన. నాయుడు గారి తరువాత పేరు గాంచిన సంగీత విద్వాంసుడు చౌడయ్య పేరున కర్నాటక రాష్ట్రంలో స్మారక మందిరం వుంది. అట్టి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన 'ద్వారం' పేర ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏదైనా కార్యక్రమం చేపట్టాలని గోపాల్ రెడ్డి సూచించారు. వక్తగా విచ్చేసిన రిటైర్డ్ జిల్లా జడ్జి కె.పి. నారాయణ రావు ప్రజలు మెచ్చిన నచ్చిన రాగాలను వయొలిన్ పై పలికించడంలో నాయుడు గారు దిట్ట. శంకరాభరణ రాగంతో పాటు క్లిష్టమైన సావిరహే, దేవగాంధారి రాగాలు ఆయన వయొలిన్‌పై వింటే జన్మ ధన్యమవు తుందన్నారు. శ్రీ ఇలపావులూరి కామేశ్వర రావు -సాహిత్య కమాన్ అనిపించుకొన్న సంగీత కమాన్ ద్వారం వెంకట స్వామి నాయుడని ప్రస్తుతించారు. వేదిక పై ప్రభుత్వ సంగీత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కొమండూరి శేషాద్రి ఆశీనులయ్యారు. సమాజం కార్యదర్శి బి.వి. నరసింహం తుది పలుకులతో ఈ చక్కని కార్యక్రమం ముగిసింది.

### ఇందిరమ్మ వల్లే ఇంత వాణ్ణయ్యాను!

మాజీ ప్రధాని స్వర్గీయ ఇందిరా గాంధీ పెట్టిన రాజకీయ భిక్షతో ఇంత వాణ్ణయ్యానని సహకార మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి చెప్పుకొన్నారు. 31 తేది ఇందిరా గాంధీ వర్థంతి పురస్కరించుకొని జిల్లా కాంగ్రెస్ కమిటీ ఇందిరా భవన్‌లో ఏర్పాటు చేసిన సభలో ప్రసంగించారు. బడుగు వర్గాల వారు రాజకీయాల్లో ప్రవేశించడానికి ఇందిరమ్మే కారణం. ఆమె ప్రవేశ పెట్టిన 20 సూత్రాల పథకం వల్లే దేశంలో ప్రజలు

### నెల్లూరు సంగతులు

పట్టెడన్నం తిన గలుగుతున్నారు. దేశంలో ఉగ్రవాదం ప్రబలి పోయింది. దీని నిర్మూలన కొరకు యువకులంతా ప్రతిన బూనాలన్నారు మంత్రి గారు మతోన్మాదం పెచ్చు పెరిగిన ఈ రోజుల్లో కాంగ్రెస్ పార్టీని కార్యకర్తలే రక్షించు కోవాలని డి.సి.సి. అధ్యక్షుడు

కొరవ 11 పేజీలో

# సణుగుడు

## * జర్నలిస్టులు గబ్బుపట్టి పోతున్నారు!
## * నక్సలైట్లు ఏమి సాధించినట్లు?

నెల్లూరు జర్నలిస్టులు జుట్టు జుట్టు పట్టుకొని వీధిన పడుతున్నారు. ఒకరి మీద మరొకరు అవినీతి ఆరోపణల బురద చల్లుకొని భ్రష్టుపడుతున్నారు. తమ పత్రికల పరువు, ప్రతిష్టలను మర్చిపోయి ప్రవర్తిస్తున్నారు. వృత్తిపరంగా తమకున్న సాంఘిక హోదా, గుర్తింపులను దుర్వినియోగ పరుస్తున్నారు. నానా గబ్బుగా వుంది పరిస్థితి. విలేఖరి అంటేనే జనంలో అలుసు ఏర్పడి పోతున్నది. విలువ లేకుండా పోతుంది.

స్పర్థలుండవచ్చు; తగువు లేర్పడ వచ్చు; భేదాభిప్రాయాలు కలుగవచ్చు. అంత మాత్రాన చొక్కాలు విప్పుకొని వీధిన పడాలా? అలబరి జాతి వారి వలె వంటికి అడుసు పూసుకోవాలా? విలేఖర్లిట్లా ఒకరి బ్రతుకుల్లోని మురికిని మరొకరు ఉతికి ఆరేస్తూ పోతుంటే వారి పత్రికలకు, వారు వ్రాసే వార్తలకు విలువ వుంటుందా? అవినీతి అనేది సర్వాంతర్యామి. పొగ మంచులా మొత్తం సమాజాన్ని చుట్టు ముట్టి వున్నదది. అందరు బ్రతికేది ఒకే బురద గుంటలో; మనసు అద్దంలో చూసుకుంటే అందరి ముఖాల నిండా ఒకే మాలిన్యం కన్పడుతూంది. ఎవరిని ఎవరూ వేలెత్తి చూపనవసరం లేదు; ఎవర్ని ఎవరూ వెక్కిరించ బనిలేదు. నిజాయితీ, నిర్భీతి, చిత్తశుద్ధి, వృత్తి ధర్మం పట్ల నిబద్ధత, నీతి, నియమం వంటి పదాలకు సమకాలీన పాత్రికేయ నిఘంటువులో చోటు లేదు. ఒక్క పాత్రికేయులనే ఏమి, ఏ వృత్తిలోనూ వాటికి ప్రాధాన్యత లేదు. న్యాయమూర్తుల లోనూ అవినీతి పరులున్నట్లు వినడం లేదా మనం?

దేశానికంతా నీతులు చెప్పే వృత్తిలో వున్న వారు విలేఖరులు; ప్రపంచంలోని తప్పులన్నీ వేలెత్తి

### డోలేంద్ర

చూపడం వృత్తి కర్తవ్యంగా పాటించే వారు విలేఖరులు; మరి వారే తప్పులు చేస్తుంటే, వారే వీధిన పడి రోత పుడుతుంటే ఎవరు బుద్ధి చెప్పాలి? వినడానికే రోతగా, ఛండాలంగా, లజ్జగా, వికారంగా వుంది నెల్లూరు విలేఖరుల జగడాల తీరు! జనం నోట్లోవుమ్మేయక ముందే ప్రవర్తన మార్చుకోండి! విలేఖరులమని చెప్పుకోవడానికే సిగ్గు పడే పరిస్థితి కల్పించకండి!

* * *

కొరవ 7 పేజీలో

# తెనాలి రామకృష్ణుడు రాయల ఆస్థానంలో వున్నట్లా? లేనట్లా?

ఔత్సాహిక చరిత్ర, సాహిత్య పరిశోధకుడు పాయసం సుబ్రహ్మణ్యం తన చిన్న ఈ పుస్తకానికి నిషేధార్థకంగా (నెగటివ్‌గా) తెనాలి రామకృష్ణ కవి శ్రీ కృష్ణదేవరాయల ఆస్థాన కవి కాదు అని పేరు పెట్టాడు. కాని, ఈ గ్రంథానికి తెనాలి రామకృష్ణ కవి అష్టదిగ్గజ కవులలో ఒకడా?' అని పేరు పెట్టి వుంటే సమంజసంగా వుండేదనిపించింది. సుబ్రహ్మణ్యం ఈ గ్రంథంలో యదార్థంగా చర్చించిన సమస్య అదే. శ్రీ కృష్ణదేవరాయల సభా భవనమైన భువన విజయంలో ఎనిమిది దిక్కులలో ప్రతిష్ఠించిన పీఠాలను అలంకరించి అష్టదిగ్గజాలు అని ప్రసిద్ధి చెందిన కవులు ఎవరు? అసలు అష్ట దిగ్గజ పీఠాలను అలంకరించిన వారంతా కవులేనా లేక వీరిలో కొంత మంది శాస్త్ర నిష్ణాతులైన పండితులు (కవులు కాని వారు) కూడా ఉండినారా? అష్టదిగ్గజ పీఠాలను అలంకరించిన వారు కవులు మాత్రం అయితే వారంతా ఆంధ్రకవులా, లేక వారిలో ఆంధ్ర కవులతో బాటు ఇతర భాషా కవులు కూడా వున్నారా? వారంతా ఆంధ్ర కవులైతే, వారెవరు? - అనే ప్రశ్నలు ఆంధ్ర కవుల చరిత్ర (1895) రచించిన కందుకూరు వీరేశలింగం కాలం నుండి పరిశోధకులకు చర్చనీయాంశాలుగా ఉండినాయి.

అల్లసాని పెద్దన, నంది తిమ్మన, ధూర్జటి, మాదయ్య గారి మల్లన, అయ్యలరాజు రామభద్రుడు,

> **గ్రంథసమీక్ష**
>
> రచయిత
> పాయసం సుబ్రహ్మణ్యం
> సమీక్షకుడు
> డా. సి.వి. రామచంద్రరావు, యం.ఎ. పి.హెచ్.డి.
> ప్రతులకు
> బిందు పబ్లికేషన్స్
> 15/102, బృందావనం
> నెల్లూరు - 524 001.
> వెల రూ. 20/-

పింగళి సూరన, రామరాజ భూషణుడు, తెనాలి రామకృష్ణుడు అష్టదిగ్గజాలని ఆంధ్ర దేశంలో జనశ్రుతి, వాడుక వుంది. పెద్దన, తిమ్మన, ధూర్జటి, మల్లన అష్ట దిగ్గజాలలోని వారని పండిత పరిశోధకులందరూ అంగీకరించారు. అయ్యలరాజు రామభద్రుడు కూడా ఒక అష్ట దిగ్గజమేనని చాలా మంది అభిప్రాయ పడగా, కొందరు మాత్రం అలసాని పుత్రేటి రామభద్రునిగా గుర్తించారు. ఈ అయిదుగురు అష్ట దిగ్గజ కవులను వదలి, మిగిలిన ముగ్గురు అష్టదిగ్గజ కవులు ఎవరనేది సాహిత్య చరిత్ర కారులు, పరిశోధకులు చిరకాలంగా చర్చిస్తున్న సమస్య. ఈ చరిత్ర కారులు, పరిశోధకులు వారికి లభ్యమయిన ఆధారాలను బట్టి, వాటిని వారు సమన్వయించి అర్థం చేసుకొన్న పద్ధతిని బట్టి, అష్టదిగ్గజాలు, లేక అష్టదిగ్గజ కవుల పట్టీలు తయారు చేశారు. కొందరు, పైన పేర్కొన్న అయిదుగురు కవీశ్వరులు కాక, మిగిలిన ముగ్గురు ఇతర భాషా (సంస్కృత, కన్నడ, తమిళ) కవులని తెలిపారు; కొందరు ఈ ముగ్గురిలో కృష్ణదేవరాయల ఆస్థాన విద్వాంసుడు, నాట్యాచార్యుడు అయిన బండారు లక్ష్మీ నారాయణ వంటి శాస్త్ర నిష్ణాతులను కూడా చేర్చారు. అయితే, 1527 నాటి కృష్ణదేవరాయల తిప్పలూరు (కడప జిల్లా) శాసనం వీరిని అష్టదిగ్గజ కవీశ్వరులు అని పేర్కొనడం వల్ల, వీరు ఏ భాషకు చెందిన వారైనా కవులే అయి వుండాలి.

కొరవ 10 పేజీలో

# ట్రాఫిక్ బాగుకు ఆక్రమణలే అడ్డంకి!

నెల్లూరు టౌన్‌లో ట్రాఫిక్ మార్పుకు ఎస్పి శ్రీ కృష్ణ ప్రసాద్ రూపొందించిన మాస్టర్ ప్లాన్ అమలు కాకుండా నిల్చిపోయింది. గత నెల ఇరవై తేది నుంచి కొత్త పద్ధతిలో నడిచి తీరాలని పట్టుబట్టిన ఎస్పి గారు ఎందు వల్లనో తమ పంతం మానారు. సరైన వసతులు లేకుండా, అధ్యయనం జరప కుండా మార్పులు చేస్తే ప్రజల నుంచి వచ్చే ప్రతిఘటన తట్టుకోలేమని ఎమ్మెల్యే శ్రీ బి.కె. రెడ్డి

**అవినీతితో టౌన్ ప్లానింగ్‌ను పెన్నలోకి తోసేయడంతో వీధులు ఇరుకై పోతున్నాయి!**

గట్టిగా వాదించడంతో ఎస్పి గారు పునరాలోచనలో పడినట్లున్నారు. ఎటూ కాలవ్యవధి లభించింది కాబట్టి, దీని పై ప్రజల నుంచి సూచనలు, సలహాలు స్వీకరించడం అవసరం.

రెండు వారాల క్రితం 'జమీన్‌రైతులో' ఈ మాస్టర్ ప్లాన్ పై చేసిన పరిశీలన. తదనంతరం మా పాఠకులు చేసిన సూచనలు, చెప్పిన సలహాలు ఎస్పి గారికి కోపం తెప్పించినట్లున్నాయి. ఐపిఎస్ చదివిన తమకంటే అప్టరాల్ ఒక పత్రిక టౌన్ సమస్యలను ఆకళింపు చేసుకో గలదా అన్న ధోరణిలో ఆయన ప్రతిస్పందించినట్లున్నారు. అదే నిజమైతే, ఆయన మీద జాలి పడాల్సిందే! ప్రజాస్వామ్యంలో పత్రికా వార్తలు, వ్యాఖ్యలు సహృదయంతో స్వీకరించడం అధికారుల కర్తవ్యం. అధికారుల కంటే పత్రికలకే ప్రజలతో ప్రత్యక్ష సంబంధాలు అధికంగా వుంటాయి; ప్రజా సమస్యలు పత్రికలు అర్థం చేసుకున్నంతగా అధికారులు అర్థం చేసుకోలేరు. వారికా అనుభవం, అవగాహన వుండవు. తాను చెప్పిన మాటకు ఎవరూ ఎదురు చెప్పకూడ దనడం అహంకార మన్పించుకుంటుంది; అది సమస్యను మరింత జటిలం చేస్తుందే తప్ప, పరిష్కరించ లేదు.

ఈ మాస్టర్ ప్లాన్ పై ఎందరో పాఠకులు తమ అభిప్రాయాలు, సూచనలు తెల్పారు. వాటిలో ముఖ్యమైనవి కొన్ని ఇస్తున్నాము. ఎస్పి గారు వీటిని సహృదయంతో పరిశీలిస్తే మార్పులను మరింత మెరుగ్గా చేసేందుకు వీలుంటుంది.

### రోడ్డంతా ఆక్రమణలు- పార్కింగ్ లేని కట్టడాలు!

నెల్లూరు టౌన్ ట్రాఫిక్ సమస్యను పరిష్కరించడానికి ఎస్పి గారు చొరవ చూపడం అభినందనీయం. ఆయన మాస్టర్ ప్లాన్ పై మీరు చేసిన విమర్శ సహేతుకంగా వుంది; మంచి చెడ్డలు చర్చించారే కాని, సమస్యకు మూలకారణాలను గాలించలేదు. వాహనాల సంఖ్య

**స్టోన్‌హౌస్‌పేటను వన్‌వే చేస్తే రిక్షాబాడుగలు భరించలేము! రైల్వేస్టేషన్ రోడ్డూ అంతే!**

అపరిమితంగా పెరగడం ఒక కారణమైతే, మునిసిపాలిటీ అవినీతి, అసమర్థత అసలు కారణం. ప్రజలలో సివిక్ సెన్స్ లేక పోవడమూ ఒక కారణమే. మునిసిపల్ అధికారులు తమ అవినీతితో టౌన్ ప్లానింగ్‌ను పెన్నలోకి నెట్టేశారు. టౌన్‌లో ఎక్కడ బట్టినా రోడ్డు ఆక్రమణలు, రూల్సుకు వ్యతిరేకంగా కట్టడాలు పెరిగిపోయాయి. కొత్తగా వచ్చే షాపింగ్ కాంప్లెక్స్‌లకు కూడా పార్కింగ్ లేదు. వాటి దగ్గరకు వచ్చే వాహనాలు రోడ్డులోనే నిలపాలి. రోడ్డే పార్కింగ్ అయినప్పుడు తిరగడానికి చోటుండదు. ఇంకొక ప్రక్క తోపుడు బండ్లు, టీబంకులది సమస్య. మద్రాసు బస్టాండ్ దగ్గర ఆక్రమణలు తొలగించారు కదా ? అదే ప్రకారం టౌనంతా చేయవచ్చు కదా! మానవతా దృష్టి అడ్డు వస్తుందన్నది ఒట్టి సాకు మాత్రమే. ఎక్కడో మారు మూల కాలువ కట్టల పైన గుడిసెలు తొలగించాలంటే మానవత్వం అడ్డం రావచ్చు; కాని టౌన్ మధ్యలో అందరికీ అవసరమైన రోడ్డు ఆక్రమించుకొని కాంక్రీటు ఇళ్లు కట్టుకొనే వారి కోసం మానవత్వం ఎందుకు? ఆ ఇళ్లు కట్టేటప్పుడే ఆపవచ్చు కదా?

ఆత్మకూరు బస్టాండు దాటిన తర్వాత సర్వేపల్లి కాలువకు తూర్పుగా వున్న సన్న రోడ్ల పై ఆక్రమణలు తొలగించి వెడల్పు చేస్తే స్టోన్‌హౌస్ పేటలో తొక్కిడి తగ్గుతుంది. పెన్నకవతల నుంచి వచ్చే మామూలు వాహనాలను ఆనకట్ట మీదుగా రంగనాథుని దేవాలయం దారిన యాభై సంవత్సరాల నుంచి వున్న మార్గం. అయితే జాఫర్ సాహెబ్ కాలువ హెడ్ స్లూయిస్‌ను పునర్నిర్మించి, బ్రిడ్జి మీదకు దారి లేకుండా చేశారు. దీనిని రోడ్డుకు కల్పితే రంగనాయకుల పేట గొల్ల వీధికి కనెక్షన్ ఏర్పడుతుంది. ట్రాఫిక్ సులభంగా వెళ్తుంది. లక్షలు పెట్టి కట్టిన బ్రిడ్జిని చిన్న చిన్న ఆక్రమణల పేరుతో పాడు పెట్టడం మన ప్రభుత్వానికే చెల్లింది. ఈ దారి

**వర్క్‌షాపులు, ఇనుపంగళ్లు రోడ్డునాక్రమిస్తే ట్రాఫిక్ ఎట్లా కదులుతుంది?**

టౌన్‌లోకి వదిలితే ఆత్మకూరు బస్టాండు సెంటర్‌లో రద్దీ తగ్గుతుంది. బుచ్చి, కోవూరుల నుంచి వచ్చే వాహనాలకు ఇది అనుకూలం. నూట ఏర్పడితే ఏటికి ఉత్తరం ప్రక్క లెవల్ క్రాసింగ్ వద్ద గంటల తరబడి నిలబడాల్సిన అవస్థ కొందరికైనా తప్పుతుంది. కొరవ 8 పేజీలో

# రొయ్యల చెరువుల్లో విద్వేష విషం చిలకరింపు!

తీరంలోని గ్రామాలలో బంగారు పంటలు పండించి, జిల్లా ఆర్థిక స్వరూపాన్నే మార్చివేయగలదనుకున్న రొయ్యల పెంపకం కొందరు బ్లాక్ మెయిలర్ల పుణ్యమా అని ప్రమాదంలో పడిపోతున్నది. కోస్తా గ్రామాలలో ఇటు రైతులకు, అటు పేదలకు వుపయోగకరమైన పరిశ్రమను స్వల్పమైన ప్రయోజనాలకోసం చేజేతులా నాశనం చేయను ప్రయత్నిస్తున్నారు. రొయ్యల చెరువుల వల్ల తీర ప్రాంతంలోని పట్టపు పాళెంలో మత్స్యకారుల జీవనోపాధికి భంగం కల్గుతుందన్న అపోహను ఆధారంగా చేసుకొని రొయ్యల కంపెనీలు సముద్రంలో వేసిన పైపులు, కట్టిన కట్టడాలు, పంపులు ధ్వంసం చేయమని మత్స్యకారులను పురికొల్పుతున్నారు. చెరువుల దగ్గర పనిచేసే వారిని బెదరిస్తున్నారు. ఇస్కపల్లె, కుర్రు పట్టపుపాళెం, తోటపల్లిగూడూరు మండలం కోడూరు, వెంకన్నపాళెం వంటి గ్రామాలలో ఈ సమస్య తలెత్తుతున్నది. మత్స్యకారులు కంపెనీలకు హెచ్చరికలు చేశారు. తాటిచెట్ల పాళెంలో ఒక సమావేశం జరిపి రొయ్యల చెరువులను ప్రతిఘటించాలని తీర్మానం చేశారు. ఉద్రేక పూరితమైన ప్రసంగాలు చేశారు

దుర్మార్గమైన ప్రచారం ఇది. రొయ్యల చెరువుల వల్ల కోస్తా గ్రామాలలో సమస్యలే లేవని చెప్పడం ధర్మ సమ్మతం కాదు. వీటివల్ల నీటి కొరత. విచక్షణా రహితంగా భూగర్భజలం వాడడం వల్ల మంచినీరు ఉప్పునీరుగా మారుతున్నది. ఉప్పుకాలువకు పడమరగా, మాగాణి భూములలో చెరువుల త్రవ్వకంవల్ల కట్టల నుంచి కారే ఉప్పునీటితో ప్రక్కనుండే కయ్యలు చెడిపోతున్నాయి. ఇవి రెండూ పరిశీలించ

**స్వల్పమైన ప్రయోజనాల కోసం అమాయక మత్స్యకారులలో అపోహలు పెంచి రొయ్యల పరిశ్రమను నాశనం చేస్తున్నారు.**

దగిన సమస్యలే, కాని మత్స్యకారులు వీటిని వదలి, సముద్రం నుంచి నీరు తీయడం వల్ల సముద్రంలో చేపలు దొరకకుండా పోయే ప్రమాదం వుందన్న అపోహ కల్గిస్తున్నారు. పంపులు, పైపుల వల్ల వలలు దెబ్బతిని పోతాయన్న భయం సృష్టిస్తున్నారు. ఈ దుర్మార్గ ప్రచారం వల్ల వారు భయపడిపోయి, కంపెనీలకు లేనిపోని సమస్యలు సృష్టిస్తున్నారు.

రొయ్యల పెంపకం వల్ల కోస్తా గ్రామాలే కాదు- దేశమే బాగుపడుతుంది. కొన్ని వేల కోట్ల విదేశీ మారక ద్రవ్యం సమకూరుతుంది. గ్రామాలలోనూ ఎందుకూ పనికిరాని ఉప్పు పరలు వేల రూపాయల విలువ సంతరించుకున్నాయి. మత్స్యకారుల కుటుంబాలకు సంవత్సరం పొడవునా జీవనోపాధి లభిస్తున్నది. రొయ్యపిల్లల సేకరణ వంటి నూతన వృత్తులు వారి ఆదాయాన్ని అపరిమితంగా పెంచుతున్నాయి. మంచినీటి కొరత, ఉప్పునీటి కాలుష్యం వంటి ఒకటి రెండు ఇబ్బందులు సాకుతో మొత్తం రొయ్యల పరిశ్రమనే పాడు చేయజూడడం అన్యాయం. దీనివల్ల రొయ్యల పెంచే రైతులు, కంపెనీలే కాదు- మత్స్యకారులూ నష్టపోతారు. దేశానికే నష్టం జరుగుతుంది.

కలెక్టర్ గారు ఉదార బుద్ధితో, విశాల హృదయంతో ఈ సమస్యను పరిశీలించి, పరిశ్రమ నాశనం కాకుండా చూడాలి! ఏ గ్రామానికా గ్రామంలో సమస్యలు అధ్యయనం చేసి పరిష్కారానికి ప్రయత్నించాలి! ఒక సారి మత్స్యకారుల మనసులలో విషం చిలకరిస్తే మళ్లీ దాన్ని రూపు మాపడం కష్టం; మత్స్య కారుల సహకారం లేకుండా రొయ్యల పరిశ్రమ మనుగడ సాగించడం దుర్లభం.

## జిల్లావార్తలు

### కానిస్టేబిల్ సాహసంతో దొంగల నాయకుడి అరెస్ట్

గూడూరు పిట్టెపాళెం, కుమ్మరి వీధులలో 31 తేది రాత్రి ఒక ఆయిల్ షాపు, ఇంకొక బంగారు అంగడి తలుపులు పగుల గొట్టి పారిపోతుండిన ఒక దొంగల ముఠాను, గూడూరు వన్‌టౌన్ కానిస్టేబిల్ పివి మస్తానయ్య సాహసంతో పట్టుకున్నాడు. ఇద్దరు దొంగలు ఈ దోపిడీలు పూర్తి చేసుకొని, వెళ్లేటప్పుడొక నైట్ బీట్‌లో వున్న ఆ కానిస్టేబిల్ కళ్లలో పడ్డారట. వారిని తరుముకోవడంతో ఒకడు కానిస్టేబిల్ పై పెద్ద బండరాయి విసిరి పారిపోయాడట. ఇంకొకడు చేతికి దొరికాడు కాని, వంటికి నూనె రాసుకొని వుండడంతో వాడూ జారిపోయాడు. వారి వెంట బడి తరిమి కుమ్మరి వీధి ఎదురు సందులో పడిసి పట్టి, చుట్టు ప్రక్కల వారి సాయంతో కట్టి పడేసి, స్టేషన్‌కు లాక్కుని వెళ్లారు మస్తానయ్య. దొరికిన దొంగ బిట్రగుంటకు చెందిన ఒక పేరుమోసిన ముఠా నాయకుడట. గూడూరులో చాలా దొంగతనాలతో వాడికి సంబంధం వున్నట్లుంది.

ఏ ఆయుధ సహాయం లేకుండా ఒక కానిస్టేబిల్ ఒంటరిగా దొంగలను తరిమి పట్టుకోవడం సాహసోపేతమైన చర్య. ఎస్పిగారు ఆ కానిస్టేబిల్‌కు ఏదో ఒక గుర్తింపు ఇవ్వడం బాగుంటుంది.

### దొంగలు బాబోయ్ దొంగలు

రాపూరులో ఇటీవల దొంగతనాలు విరివిగా జరుగుతుండడంతో ప్రజలకు కంటి నిండా నిద్ర కరవయ్యింది. చీకటి పడడమే తరువాయి చోరులు తమ హస్తలాఘవాన్ని రుచి చూపిస్తున్నారు. 29 తేది రాత్రి 8 గంటల ప్రాంతంలో రాపూరమ్మ దేవాలయం నుంచి తిరిగి వెళుతున్న మహిళను ఓ దుండగీడు దారికాచి, మెళ్లోనుంచి మూడు సవర్ల బంగారు దండ లాక్కెళ్లాడు. 30 తేది వ్యాపార కూడలి ప్రాంతంలో వున్న బిస్కెట్ షాపులోనికి జొరబడి 5వేల రూపాయల విలువ చేసే వస్తువులతో కొందరు వుడాయించారట. అవేగాక గ్రామంలో ఆరు బయట వుంచుతున్న వస్తువులన్నీ తెల్లారే సరికి మాయమై పోతున్నాయని ప్రజలగోడు. ఇంత జరుగుతున్న పోలీసులు స్పందించి బందోబస్తు ఏర్పాటు చేయడం వంటి చిన్నపని కూడా చేయలేదని ఆరోపణ. ఇకనైన ఎస్.ఐ నవాబ్ జాన్ కార్యరంగంలో దూకుతారో, లేదో చూడాలి.

### ముంపు ప్రాంతాల ప్రజల అతితెలివి

అవకాశం దొరికితే చాలు అధికారుల సహాయంతో ప్రభుత్వాన్ని కొరవ 8 పేజీలో

# నెల్లూరు [illegible] విలక్షణుడు

### జనార్దన రెడ్డి

జనార్దన రెడ్డి గారు జిల్లా పర్యటనలో వున్నారు. ఈ రోజు (5 తేది) సర్వేపల్లి నియోజక వర్గం. బహుశా రేపు లేదా ఎల్లుండి హైదరాబాదు వెళ్లవచ్చు; ఇంకా నిర్ణయం కాలేదు.

### పెంచలయ్య

జిల్లామంత్రి శ్రీ పసల పెంచలయ్య 3 తేది నెల్లూరు వచ్చారు. ఈ రోజు వరకు ఇక్కడే వున్నారు. ఎప్పుడు వెళ్లేది తెలియదు.

### వర్షపాతం

అక్టోబర్ 28 తేది నుండి నవంబరు 3 తేది వరకు జిల్లాలో విస్తారంగా వర్షాలు పడ్డాయి. 46 మండలాలకు గాను మనుబోలు, దుత్తలూరు, అనంతసాగరం, దొరవారి సత్రం కేంద్రాలలో రెయిన్‌గేజ్‌లు లేవు. కావలి డివిజన్‌లోని పలు మండలాల వర్ష నివేదిక జిల్లా కేంద్రానికి ఇంకా చేరలేదు. అందిన వివరాల ప్రకారం గూడూరు డివిజన్‌లోని సైదాపురం మండలంలో అత్యధిక వర్షం 263 మిల్లీమీటర్లు- కావలి డివిజన్ బోగోలులో 31.4 మిల్లీ మీటర్ల తక్కువ వర్షం నమోదైంది.

| | |
|---|---|
| సైదాపురం | 263.8 మి.మీ. |
| తడ | 259.2 మి.మీ. |
| చిల్లకూరు | 236.6 మి.మీ. |
| పొదలకూరు | 228.8 మి.మీ. |
| బి.పి. గూడూరు | 223.8 మి.మీ. |
| బాలాయపల్లి | 222.2 మి.మీ. |
| వాకాడు | 216.6 మి.మీ. |
| గూడూరు | 209.0 మి.మీ. |
| పెళ్లకూరు | 196.8 మి.మీ. |
| నాయుడు పేట | 195.8 మి.మీ. |
| వెంకటగిరి | 195.7 మి.మీ. |
| డక్కిలి | 188.6 మి.మీ. |
| కోట | 183.7 మి.మీ. |
| సూళ్లూరుపేట | 175.6 మి.మీ. |
| ఓజిలి | 170.0 మి.మీ. |
| చిట్టమూరు | 164.4 మి.మీ. |
| ఉదయగిరి | 140.0 మి.మీ. |
| కనిగిరి | 132.2 మి.మీ. |
| మర్రిపాడు | 114.4 మి.మీ. |
| రాపూరు | 111.2 మి.మీ. |
| కావలి | 86.5 మి.మీ. |
| బోగోలు | 31.4 మి.మీ. |





బెస్ట్ పెర్ఫార్మెన్స్ అవార్డును ఆప్కాబ్ ఛైర్మన్ వెంకటేశ్వర రావు నుంచి అందుకుంటున్న నెల్లూరు కోఆపరేటివ్ బ్యాంకు ఛైర్మన్ వేమారెడ్డి రామచంద్రా రెడ్డి

## గూడూరు హత్య- దర్యాప్తు ఏమైంది?

గూడూరు, గంగమ్మగుడి వీధిలో సెప్టెంబరు 25 తేది రాత్రి జరిగిన కరేటి లక్ష్మీనరసా రెడ్డి కేసు విషయమై పోలీసు దర్యాప్తు సక్రమంగా జరగడం లేదన్న ఫిర్యాదు వినవస్తోంది. ఆంధ్రా బ్యాంకు మిద్దె మీద, ఇంట్లో ఒంటరిగా వుండిన లక్ష్మీనరసా రెడ్డి (69) ని ఎవరో గొంతు నులిమి చంపారు. అతడి మెడపైన, చేతుల పైన గోళ్లతో రక్కిన గాట్లుండినాయి. ఆయనకు, తన ఇంటి ప్రక్కనే వున్న ఒక స్త్రీతో అక్రమ సంబంధం వున్నదట. ఆమె తరచు ఇతడ్ని ఆస్తి వ్రాసివ్వమని వత్తిడి చేసేదట. ఆమెకతను ఒక ఇల్లు కూడా కట్టించి ఇచ్చాడట. ఈ ఆస్తికి సంబంధించిన స్పర్థలతో ఆమె ఈ ఘాతుకానికి పాల్పడి వుండ వచ్చునని బంధువుల అనుమానం. పోలీసు మాత్రం నెలా పది రోజులు గడిచినా ఈ కేసు విషయమై కనీస పాటి దర్యాప్తు చేసినట్లు లేదు.

ఎస్.పి. గారూ - మీరైనా జోక్యం చేసుకొని హంతకులను పట్టుకొనేందుకు ప్రయత్నించండి!

## రిటైర్డ్ ఉద్యోగుల భూకంప విరాళం

మహారాష్ట్ర భూకంప బాధితులకు నెల్లూరు జిల్లా రిటైర్డ్ ఎంప్లాయిస్ అసోసియేషన్ తరఫున వెయ్యి నూట పదహార్లు విరాళంగా పంపారు. సంఘం కార్యదర్శి శ్రీ టి. దొరస్వామి కలెక్టర్ గారికి ఈ డ్రాఫ్ట్ అందజేశారు.

## నెల్లూరు కో ఆపరేటివ్ బ్యాంక్‌కు అవార్డు

నెల్లూరు కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు రుణాల వసూళ్లలో సాధించిన ప్రగతిని గుర్తించి "ఉత్తమ పెర్ఫార్మెన్స్" కు రాష్ట్ర సహకార

కొరవ 7 పేజీలో

# నిర్యాణము

మమ్మింతవారిని చేసిన

మా తల్లి

## పొత్తూరి జాలమ్మ గారు

(స్వర్గీయ పొత్తూరి రంగనాయకులు గారి భార్య - పందిళ్ళపల్లి - చీరాల)

**29.10.93** తేది శుక్రవారం

మమ్ము దుఃఖసాగరమున ముంచి స్వర్గస్తురాలైనది. ఆమెలేని లోటు మాకెవ్వరూ తీర్చలేనిది ఆమె ఆత్మకు భగవంతుడు చిరశాంతి కలుగజేయాలని ప్రార్థిస్తూ, శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.



వారి కర్మకృతువులు

**6.11.93** తేది శనివారం కర్మప్రారంభం

**7.11.93** తేది ఆదివారం దశాహం, తిలోదకములు, ధర్మోదకములు

**8.11.93** తేది సోమవారం పెత్తర్లు, వైకుంఠ సమారాధన

చీరాల రామమందిరం వీధిలోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

-పొత్తూరి వెంకట సుబ్బారావు,

పొత్తూరి మోహన్ రావు, M.Sc., Ag. వ్యవసాయ అధికారి - కొడవలూరు

పెంటేల సరోజినమ్మ

కోడళ్లు: పద్మావతి, నిర్మల

మనుమళ్లు: సత్యనారాయణ, సుబ్బారావు, రమేష్, శ్రీనివాస రావు, శ్రీనివాస కృష్ణ, రవిప్రసాద్, రామ్‌ప్రసాద్, రాజేంద్ర ప్రసాద్

మనుమరాళ్లు: లక్ష్మీకుమారి, అనంతలక్ష్మి, ఆదిలక్ష్మి, రత్నకుమారి, సువర్ణ లక్ష్మి.

ముని మనమళ్లు - సురేష్, సతీష్, విజయ్‌కుమార్.

ముని మనమరాళ్లు: శిరీష, అలేఖ్య, ఉషారాణి

## సణుగుడు

(4 పేజీ కొరవ)

తెలంగాణా అడవుల్లో నక్సలైట్లు ఏమి చేస్తున్నారు? పాతికేళ్ల అరణ్య వాసంతో పాటు విప్లవ యుద్ధానికి కొన్ని వేల సమిధలను ఆహుతిచ్చిన నక్సలైట్ నాయకులు సాధించిందేమిటి? శ్రీకాకుళం సాయుధ పోరాట కాలం నుంచి తెలంగాణా కీకారణ్యాలలో నక్సలైట్ల సంచారం వుంది. అంతకు క్రితమూ అక్కడ కమ్యూనిస్టు ఉద్యమాలు నడిచాయి. ఇంజనీర్లు, డాక్టర్లు కావలసిన విద్యార్థులు, వేలాది మంది యువకులు విప్లవ సిద్ధాంతాల కాకర్షితులై, ఒక విధమైన ఉన్మాదంతో ఆ ప్రవాహంలో చేరారు. పోలీసుల చేతిలో ఎన్ని ప్రాణాలు ఆహుతైనాయో లెక్కలేదు. మైళ్ల దూరం నడిస్తే గాని మంచి నీరు కూడా పుట్టని దట్టమైన అడవులలో, కొండలలో, ప్రపంచానికి దూరంగా, తిండితిప్పలు కూడా లేకుండా, అనుక్షణం ప్రాణ భయంతో, క్రూరమృగాలు, విషసర్పాల సహజీవనంతో గడిపారు. నాగరికతకు అర్థం తెలియని, అక్షరం కనుక్కోలేని అమాయక గిరిజనులతో, కొండ జాతి ప్రజలతో కలిసి జీవించారు. ప్రభుత్వాలను గడగడ వణికించారు; దండకారణ్యంలో తమకు తిరుగు లేదని నిరూపించారు. తాము చచ్చారు; ఎందరినో చంపారు. కొన్ని వందల కోట్ల విలువైన ప్రభుత్వ ఆస్తులు ధ్వంసం చేశారు. అన్నలుగా గిరిజనుల అభిమానం సంపాదించారు.

ఇంత చేసి నక్సలైట్లు సాధించిందేమిటి? విప్లవ ప్రభుత్వం ఏర్పాటు కనుచూపు మేరలో లేదు. ఎప్పటికీ అది గగన కుసుమమే. అత్యంత బలోపేతమైన ప్రభుత్వ శక్తి ముందు నక్సలైట్ల పోరాటాలు, హనుమంతుడి ముందు కుప్పిగంతులు గానే వుంటున్నాయి. ఒక ముఖ్యమంత్రి దృఢమైన రాజకీయ నిర్ణయం తీసుకుంటే ఆరు నెలల్లో ఉద్యమం పటాపంచలై పోతున్నది. ఏళ్ల తరబడి అపూర్వమైన త్యాగాలతో, అసహ్యమైన క్రూరత్వంతో నిర్మించుకున్న యుద్ధ వ్యవస్థ పేకమేడలాగా కూలిపోతున్నది. గెరిల్లా పోరాట నైపుణ్యం ప్రభుత్వానికి చికాకు కల్పించడం నిజమే కాని, అది ప్రభుత్వ పతనానికి దారి తీసే దైనా వటినో, రష్యా వటినో విప్లవ ప్రభుత్వ స్థాపన జరపగల్గుతామన్న ఆశ నక్సలైట్లలో ఇంకా వుంటే వారిని నిజాన్ని చూడలేని అంధులుగానే భావించాలి! ఉట్టికెక్కలేని అశక్తులు స్వర్గానికి నిచ్చెనలు వేయడంగానే పరిగణించాలి!

సాధారణ పౌరుడికి కూడా అర్థమౌతున్న ఈ నిజం విప్లవ సాహిత్యాన్ని సిద్ధాంతాల సారాన్ని ఔపాసన పట్టిన మేధావులనదగిన నక్సలైట్లకు ఎందుకు అర్థం కావడం లేదు? పాతికేళ్లకు పై బడిన రక్త పంకిల ఉద్యమ జీవనం తర్వాత కూడా నక్సలైట్లు వారి అంతిమ లక్ష్యానికి అమడ దూరంలో నిలబడి వున్నారు. కంటకమైన రహదారిలో నడవడం అలివి కాక నిలబడిపోయి వున్నారు. ఉద్యమ లక్ష్యం నెరవేర్చడంలో వారి వైఫల్యం నిందించ దగింది కాదు; విప్లవ పోరాటాలన్నీ విజయం సాధించాలన్న నియమం లేదు.

కాని, రెండున్నర దశాబ్దాలు తాము కలిసి మెలిసి తిరిగిన గిరిజనుల జీవితాలలో నక్సలైట్లు ఏ మార్పు తెచ్చారు? ఏ పరిణతి సాధించారు? అన్నది తర్కించుకుంటే మాత్రం నక్సలైట్లను నిలదీయక తప్పదు. ఆర్థికంగా గిరిజనులను అభివృద్ధి చేయలేక పోవడం వారి పరిధిలోని విషయం కాకపోవచ్చు. కాని సామాజికంగా వారిలో అభ్యున్నతి సాధించ లేక పోవడం నూటికి నూరుపాళ్లు నక్సలైట్ల వైఫల్యమే.

మొన్న 1 తేది ఉదయం కృష్ణా ఎక్స్‌ప్రెస్ మహబూబా బాద్ స్టేషన్‌లో ఆగింది. ముప్పయ్ నలభై మంది లంబాడీ యువతులు వేరుశెనక్కాయల బుట్టలతో స్టేషన్‌లో వున్నారు. వారిలో ఒక యువతి - ముప్పయ్యేళ్ల వయస్సుంటుందేమో - నేనున్న పెట్టెలోకి ఎక్కబోయింది. వాకిట దగ్గర ప్రయాణీకుడెవరో అడ్డంగా నిలబడి వున్నాడు. ఆ యువతి చాలా సహజంగా, అది తమ స్వభావమే నన్నట్లుగా, వున్నట్లుండి గేటు దగ్గరున్న ప్రయాణీకుడి కాళ్లను తాకి "బాంచన్ దొరా" అనేసింది. ఆ దృశ్యం చూసిన నాకు కడుపులో దేవినట్లయింది. వాకిటికి అడ్డం నిలబడిన వాడిని ప్రక్కకు జరగమని చెప్పవచ్చు; లేదా తప్పించుకుని పోవచ్చు. కాళ్లు పట్టుకొని ప్రతిమలాడ వలసిన అవసరం లేదు. యాభైఏళ్ల స్వతంత్ర భారత సామ్యవాద పరిపాలన; పాతికేళ్ల విప్లవోద్యమం తెలంగాణా గిరిజనుల మానసిక నుంచి బానిస తత్వాన్ని ఏ మాత్రం తొలగించలేక పోయాయన్న చేదు నిజానికి ఈ దృశ్యం ఒక సాదృశ్యం. ఎక్స్‌ప్రెస్ రైళ్లాగే టౌన్‌లో, కాలేజీలు, ప్రభుత్వ కార్యాలయాలు వుండే పట్టణంలోనే గిరిజనులు తమ వ్యక్తిత్వ విలువలను గ్రహించుకోలేని అమాయకత్వంలో వున్నారంటే ఇక దారి డొంకలు లేని గూడెంలలోని జనం ఇంకెంత దుస్థితిలో వుండి వుంటారో?

నలభై ఐదేళ్ల పరిపాలనలో ప్రజలకు ప్రభుత్వం ఏమి చేసిందని ప్రశ్నించే ముందు, తమకు ఆశ్రయమిచ్చి తమ ఉద్యమానికి పూతగా నిల్చిన అమాయక గిరిజనులకు తామేమి చేశామని నక్సలైట్లు ఆత్మ పరిశీలన చేసుకోవలసిన అవసరం లేదా? ప్రజలలో విప్లవ చైతన్యం తీసుక రాకుండా విప్లవ ఉద్యమం నడపాలనుకోవడం మూర్ఖత్వం కాదా?

కరడు కట్టిన కమ్యూనిస్టు సిద్ధాంతాలు కూడా కాల ప్రవాహానికి తలవొగ్గి మారి పోతున్నాయి. పెట్టుబడి దారీ వ్యవస్థకు చిహ్నమనదగిన స్టాక్ ఎక్చేంజీలు చైనాలో వెలుస్తున్నాయి. బహుళజాతి పెట్టుబడిదారీ సంస్థలను పిల్చి, పెద్దపీట వేసి, పరిశ్రమలు పెట్టిస్తున్నారు. డెబ్బయ్యేళ్ల సుదీర్ఘ విప్లవ ప్రభుత్వ పరిపాలన తర్వాత సోవియట్ రష్యా తిండి గింజలకోసం అమెరికాకు బానిసగా మారి, దేహి అంటున్నది. ఆర్థికంగా అనే కాదు-మానసికంగా కూడా రష్యా ఒక జాతిగా నిలవలేదు.

ఈ నేపథ్యంలో ఆంధ్ర నక్సలైట్లు తమ విధానాలు, లక్ష్యాలను పునః పరిశీలన చేసుకోవలసిన అవసరం వుంది. హత్యలు, విధ్వంసాలు, ఎన్‌కౌంటర్లలో చావుల వల్ల పేద ప్రజలకు ఒరిగే లాభమేదీ లేదు. వారిలో చైతన్యం తెచ్చి, సామాజిక న్యాయం కోసం పట్టుబట్టే ధైర్యం వారిలో కల్పించి, సామాజిక సంపదలో తమకు రావలసిన కనీస వాటాకోసం వారు ప్రయత్నించే స్థితికి పేదలను సమాయత్తం చేయడం నక్సలైట్ల కర్తవ్యం. అందుకు హింస ఒక్కటే మార్గం కానవసరంలేదు. విద్య, విజ్ఞానం హింస కంటే శక్తివంతమైన సాధనాలు. ఐన్నేళ్ల పోరాటం తర్వాత కూడా తమతోటి ప్రజలలో కనీస పాటి వ్యక్తిత్వ విలువలు పెంచలేక పోయాయని చెప్పుకోవలసి రావడం నక్సలైట్లకూ అవమానమే కదా!

## సైన్యం చేతులు

(2 పేజీ కొరవ)

ఇంకోక ప్రక్క కాశ్మీర్ హైకోర్టులో తీవ్రవాదులకు ఆహార సరఫరా చేయాలంటు కేసు విచారణకు వస్తే, ప్రభుత్వం దాన్ని ప్రతిఘటించలేదు. ఫలితంగా దర్గాలోపలకు ఆహారం వెళ్లింది. ఆకలితో, దాహంతో తీవ్రవాదులు లొంగిపోయే పరిస్థితి ఏర్పడిన సమయంలో ఈ పరిణామం సైన్యాన్ని నిరుత్సాహ పరచింది. వారు హతాశులై పోయారు. సుప్రీం కోర్టు అప్పటిలోనూ ప్రభుత్వం పట్టుదలగా వ్యవహరించలేదు. దర్గాలోపలకు ఆహారం పంపకూడదని, లోపలున్నవారే ముళ్లకంచె వద్దకు వచ్చి తినిపోవాలని సుప్రీం కోర్టు చేసిన ఆదేశం సైన్యం పూపిరిని కొంత వరకు నిల్పింది. మరొక్క వారం రోజులు ఆహారం సరఫరా ఆపివుంటే తీవ్రవాదులు లొంగిపోయి వుండేవారు. ప్రభుత్వం చేజేతులా పరిస్థితిని ప్రతికూలం చేసుకున్నది.

దర్గా నుంచి తీవ్రవాదులను వెలికి రప్పించడానికి ఇటు సైన్యం అటు పోలీసులతో పాటు, రక్షణ హోం మంత్రిత్వ శాఖలు కూడా పలు ప్రతిపాదనలు సమర్పించాయి. కానీ కాశ్మీర్ వ్యవహారాలను స్వయంగా చూస్తున్న ప్రధాని పివి నరసింహరావు దేనికీ అంగీకరించలేదు. సమస్య నానుతూవుంది. రోజు రోజుకీ సైన్యం ఓపిక తగ్గుతున్నది. తిండి తిప్పలు లేకుండా రాత్రింబవళ్లు కంటిమీద కునుకు లేకుండా, రెప్పలార్పకుండా వారు దర్గాను కాపలా కాస్తుంటే, ప్రభుత్వం లోపలున్న తీవ్రవాదులకు పండ్లు, పాలు, స్వీట్లు పంపి మర్యాద చేయడం ఎవరికైన కడుపు మండదా?

ఆహార సరఫరా నిర్బంధించి, చర్చల విషయంలో కఠినంగా వుండివుంటే తీవ్రవాదులు ఆకలికి తాళలేక ఈ పాటికి లొంగి పోయి ... ప్రభుత్వం ఇప్పటికైనా కాశ్మీర్ విషయంలో సుధృఢ నిర్ణయం తీసుకొని, టెర్రరిస్టులను కఠినంగా అణచి వేయడంలో సైన్యానికి స్వేచ్ఛ ఇస్తే తప్ప పాకిస్తాన్ ఆటల కట్టించడం సాధ్యం కాదు. ఊగిసలాటలో వున్నంత కాలం టెర్రరిస్టుల ఘాతుకాలు కొనసాగుతూనే వుంటాయి.

## నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ కొరవ)

భూమి అభివృద్ధి బ్యాంకు ఒక అవార్డు బహూకరించింది. ఛైర్మన్ శ్రీ వేమారెడ్డి రామచంద్రా రెడ్డి, అప్కాబ్ ఛైర్మన్ శ్రీ వెంకటేశ్వర రావు నుంచి అవార్డు షీల్డును అందుకున్నారు. నెల్లూరు బ్యాంకులో ఈ ఏడాది 49.82 శాతం రుణాల వసూళ్లు చేశారట. ఇది వరకంతా వసూళ్ల శాతం 7,8 మించేది కాదట. ఇంత అధికంగా డబ్బు దండినందుకు ఈ అవార్డు ఇచ్చారు. రామచంద్రా రెడ్డి గారి బ్యాంకు పాలనకు మంచి గుర్తింపు, గౌరవం ఎంతరించి పెట్టింది అవార్డు. కంగ్రాచ్యులేషన్స్!

### మునిసిపల్ సమ్మె

నెల్లూరు మునిసిపాలిటీలో సిబ్బంది సమ్మె కొనసాగుతూనే వుంది. ఐరవై రెండు [illegible] ప్రభుత్వానికి చీమ కుట్టినట్లు కూడా [illegible] టౌన్‌లో ఎక్కడ చూసినా పెంట కుప్పలే. మలేరియా, టైఫాయిడ్ జ్వరాలు ముమ్మరంగా వ్యాపించాయి. దోమలకు స్వాతంత్ర్యం లభించి నట్లుంది. జాండిస్ కూడా ప్రబలుతూంది. ప్రభుత్వం సత్వరం ఏదో ఒక నిర్ణయం తీసుకొని సమ్మె విరమింప జేయకుంటే చాలా ప్రమాదకర పరిస్థితి ఏర్పడుతూంది.

### మరణం

నెల్లూరు వ్యవసాయ శాఖ అసిస్టెంట్ డైరక్టర్ శ్రీ పి. మోహన రావు తల్లి బాలమ్మ (84) 31 తేది మరణించారు. మోహనరావు చీరాల వాసి అయినా నెల్లూరి వాడి క్రిందే లెక్క. నెల్లూరు రైతులతోనే సంబంధా లెక్కువ.

వారి కుటుంబానికి మా సానుభూతి.

## ట్రాఫిక్

(5 వ పేజి కొరవ)

రైల్వే స్టేషను ఆత్మకూరు బస్టాండుల మధ్య సామాన్లతో ప్రయాణించే వారు చాలా మంది వుంటారు. ఈ రెండింటి మధ్య ప్రయాణం ఐదు నిముషాల లోపే. ఈ రోడ్డు ఇరుకైనది కాదు. దీన్ని వన్‌వేగా మార్చితే సంతపేట మార్కెట్, సెంట్ జోసఫ్ ఆస్పత్రుల మీదుగా ప్రయాణించడానికి అరగంట పడుతుంది. చుట్టు తిరిగి రావాలి. ట్రాన్స్‌పోర్టేషన్ పద్ధతుల రూప కల్పనలో వాహనాలు ఎంత త్వరగా రోడ్డును వదలి కదలి పోతాయి అన్న విషయానికి ప్రాధాన్యత ఇస్తారు. ఐదు నిముషాలలో రోడ్డు వదలాల్సిన వాహనం అరగంట రోడ్డు పై వుంటే ట్రాఫిక్‌కు ఎట్లా సౌకర్యం? స్టోన్‌హౌస్ పేటను వన్‌వే చేసినా ఇదే బాధ అక్కడి నుంచి టౌన్‌లోకి రావాలంటే పాతవీధి, పప్పుల వీధుల మీదుగా శెట్టిగుంట రోడ్డుకు, అక్కడ నుంచి హైవే మీదుగా ఆత్మకూరు బస్టాండుకు రావాలి. ఇటువంటి నిబంధనల వల్ల రిక్షా బాడుగలు మితి మీరి పోతాయి; ఇంధనం పొదుపు నినాదం వ్యర్థమౌతుంది. అనవసర కాలయాపన జరుగుతుంది. అసలు లక్ష్యం నెరవేరదు.

- టి.కె. రెడ్డి

నెల్లూరు ఛార్టర్డ్ ఇంజనీరు

### వర్క్‌షాపులు తరలించాలి

కృష్ణప్రసాద్ గారి మాస్టర్ ప్లాన్ మౌలిక ప్రాతిపదికగా స్వీకరించాలి. అయితే అందులోని ప్రతిపాదనలు పునః పరిశీలించడం అవసరం. జమీన్‌రైతు పత్రిక సూచనలను మరింత లోతుగా పరిశీలించాలి.

కలెక్టరు, మునిసిపల్, ఆర్ అండ్ బి వంటి శాఖల అధికార్లు కలసి న్యూసెన్స్‌గా వున్న ఆక్రమణలను విచక్షణా రహితంగా తొలగించాలి. టౌన్‌లో ఇంకా మిగిలి వున్న వర్క్‌షాపులను తక్షణం ఆటోనగర్‌కు తరలించాలి. ఇప్పటికీ చాలా వర్క్ షాపులు రోడ్ల పై పని చేస్తున్నాయి. సిమెంటు, ఇనుప అంగళ్ల వారు తమ వస్తువులను రోడ్డు పై పెట్టడం నిషేధించాలి. పెన్నార్ బ్రిడ్జి నుంచి నెహ్రూ విగ్రహం వరకు మిని బైపాస్ రోడ్డును సక్రమంగా నిర్వహించాలి. నేషనల్ హైవే రోడ్డును వీలైన దగ్గరల్లా వెడల్పు చేయాలి.

నెల్లూరు -ప్రొఫెసర్ ఏసి రెడ్డి

### రాజకీయాలకు లొంగవద్దు

ఎస్పి గారు ట్రాఫిక్ పద్ధతులను సమూలంగా మారుస్తున్నారని జమీన్‌రైతులో చదివి సంతోషించాను. స్వర్గీయ వ్యాస్ రాత్రింబవళ్లు కష్టపడి విజయవాడ నగరాన్ని, దాని ట్రాఫిక్ పద్ధతులను ఎంతో అభివృద్ధి చేశారు. మొదట్లో వ్యాస్ గారు కూడా విమర్శలకు గురైనారు కాని ఆయనప్పుడు ఎవ్వర్నీ లెక్క చేయలేదు. ఇప్పుడాయనను అందరూ ప్రశంసిస్తున్నారు. ఎస్పి గారు రాజకీయ నాయకుల మాట వినకుండా, విమర్శలకు జంక కుండా లాఠీ చేతపట్టి, కొత్త పద్ధతులు అమలు చేయాలి. మంచి పని కోసం నియంతగా వ్యవహరించినా తప్పులేదు.

ట్రాఫిక్ రూల్స్ మార్పులో నెహ్రూ బొమ్మకు దక్షిణంగా అప్పయ్య గేటు వరకున్న పరిస్థితి ప్రస్తావించ లేదు. ఈ రోడ్డును వెడల్పు చేసి, డివైడరులు ఏర్పాటు చేస్తే బాగుంటుంది. టౌన్‌బస్‌ల అబందరను తగ్గిస్తే సగం సమస్య తగ్గుతుంది.

-ఎస్.కె. మహబూబ్ భాషా

కలిచేడు

### సమీక్ష బాగుంది

నెల్లూరు రోడ్ల ట్రాఫిక్ క్రమబద్ధీకరణ గురించి మీ సమీక్ష బాగుంది. ప్రవాసులమైన మాబోటి వారం టౌన్‌కు వచ్చినప్పుడు అయోమయంలో పడకుండా ఉపకారం చేశారు.

-పి. రంగనాథ్

మార్కాపురం

### కొరివితో తలగోక్కోవద్దు

కొత్త ట్రాఫిక్ పద్ధతుల రూప కల్పనకు ఎస్పి గారు తీసుకున్న చర్య సాహసోపేత మైనదైనా దీర్ఘకాలంలో చేయాల్సిన పనులను ఒకే పర్యాయం పట్టణాని కంతా వర్తింప జేయడం ప్రజలను ఇబ్బంది పాల్జేయడంతో పాటు, అధికారులకూ కొరివితో తల గోక్కున్నట్లు వుతుంది.

ఆక్రమణలు తొలగించడం, రోడ్లు వెడల్పు చేయడం, ట్రాఫిక్ ఐలండ్లు రోడ్డు డివైడర్లు, పేవ్‌మెంట్లు వంటివి నిర్మించకుండా అధికారులు అనుభవ శూన్యమైన నిబంధనలు విధిస్తే ట్రాఫిక్ ప్రమాదాల వంటి కొత్త సమస్యలు తలెత్తుతాయి. పట్టణానికత్యవసరమైన బైపాస్ రోడ్డు, రింగ్ రోడ్డు వంటివి రూపుదిద్దు కునే వరకు జమీన్‌రైతు సూచించిన అనుభవో పేతమైన సలహాలు కొన్నింటినైనా పాటించక పోతే అధికారులు చేసే ప్రయోగం ప్రజలను ఇరకాటంలో పెట్టడ మౌతుంది. ఆ ప్రయోగమూ స్వల్పకాలంలో తలక్రిందు లౌతుంది.

-ఎన్.ఆర్. రెడ్డి

కొచ్చిన్, కేరళ

## జిల్లావార్తలు

(5 పేజీ కొరవ)

మోసగించను ప్రజలు తయారై పోతున్నారు. రాపూరు మండలంలోని గుండవోలు, ఓబులాయపల్లి, నెల్లేపల్లి, లింగపాళెం, శుద్ధ మళ్ల గ్రామాలలోని భూములు తెలుగు గంగ కాల్వ నిర్మాణం పనుల మధ్య ముంపు గ్రామాల జాబితాలో చేరి పోయాయి. ఇప్పటి వరకు ముంపు భూముల వరకు మాత్రం ప్రభుత్వం నష్ట పరిహారం చెల్లించి వేసింది. నవంబరు నెలాఖరు నుంచి నివాస గృహాలకు కూడా నష్టపరిహారం చెల్లించను సర్వే నిర్వహిస్తారన్న విషయం ఆనోట ఈనోట విన్న ప్రజలు తెలివిగా, పరిహారం పొందేందుకు వివిధ మార్గాలు రూపొందించు కోవడంలో నిమగ్నమై వున్నారట. డబ్బున్న ఆసాములు గ్రామంలో ఖాళీగా వున్న చోటల్లా కొత్త ఇళ్లను తాత్కాలిక ప్రాతిపదికన నిర్మిస్తున్నారు. ప్రభుత్వ, ప్రవేట్, భూమి అనే తేడా లేకుండా ఈ కార్యక్రమంలో మునిగి తేలుతున్నారట. కొందరు ఈ గ్రామాల్లో పరిహారం పొందిన జాబితాలో చేరితే తమకు వుద్యోగాలు వస్తాయన్న ఆశతో వేరే గ్రామాల నుండి వచ్చి ఇళ్లు కట్టు కొంటున్నారట. మంచి తరుణం మించిన రాదని మరి కొందరు మధ్యవర్తులతో అధికార్లు 'మిలాఖత్' అయ్యేసరికి వుద్యోగాల విషయమై 'డబ్బు' కూడా చేతులు మారుతుందట. వున్నతాధికారులు జోక్యం చేసుకొని వాస్తవ బాధితులను కనుగొన కుంటే లక్షలాది రూపాయలు తెలుగు గంగ కాల్వలో నీరు వదలక ముందే కొట్టుక పోవడం ఖాయం!

### వింజమూరులో నూర్ బాషా పెడరేషన్

వింజమూరులో నూర్ బాషా ఫెడరేషన్ ఇటీవల ఆవిర్భ వించింది. బోగస్ కుల సర్టిఫికెట్లతో పలు వున్నత వర్గాల్లోని వారు బి.సి.లుగా నమోదు చేయించుకోవడం వల్ల వాస్తవ వర్గాలు నష్ట పోతున్నాయని కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన పినాకిని గ్రామీణ బ్యాంకు మేనేజర్ ఖాజా సాహెబ్ అన్నారు. మండల బి.సి. సమాఖ్య అధ్యక్షుడు ఎ. రమణయ్య, కన్వీనర్ బాబు రమణయ్య మాట్లాడారు. అనంతరం జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో అధ్యక్షుడుగా సి. రంతుల్లా, ఉపాధ్యక్షునిగా సి. ఖాజావలి, కార్యదర్శిగా షేక్ హజరత్, కోశాధికారిగా కె. పెద వీరయ్య ఎన్నికయ్యారు.

### వితంతు పెన్షన్లు అర్థంలేని నిబంధనలు

రాష్ట్ర ప్రభుత్వం వృద్ధులు, వితంతువులు, వికలాంగులకు ఇచ్చే పించను మంజూరు చేయడంలో విధించిన నియమ నిబంధనలు ఏమాత్రం సమంజసంగా లేవు. నామ మాత్రంగా ఇచ్చే 30రూపాయలను మంజూరు చేసేందుకుగాను అర ఎకరం బంజరు భూమి కూడ వుండకూడదు. ఒకరికి అనువర్తిస్తే ఇంకెవ్వరూ ఆ ఇంట్లో పథక ప్రయోజనాన్ని పొందేందుకు అర్హులు కాదు. గతంలో పెన్షన్ దార్లకు జిల్లా ఖజానా కార్యాలయం నుండి పోస్టాఫీసు ద్వారా ప్రతి మూడు మాసాలకు ఒకసారి పెన్షన్ ఇచ్చే పద్ధతి మార్చారు. కాకులను తరమి గ్రద్దలకు వేసినట్లు పోస్టల్‌శాఖ నుండి ఈ పంపిణీ బాధ్యతను రెవిన్యూ శాఖపై వేసి వి.ఎ.ఓ లను పెన్షన్‌ను పంచమన్నారు. రికార్డులను తారుమారు చేయడంలో ఘనాపాటులైన వీరు స్వంత లాభం కొంత చూసుకొన్నాకే పెన్షన్ సొమ్మును వాస్తవదారులకు అందజేస్తున్నారు. ఇది కూడా నెలనెల ఇవ్వక ఏదో బుద్ధిపుట్టినప్పుడు ఇవ్వడం అలవాటై పోయింది. నిరాశ్రయులకు ఈ 30రూపాయల ప్రభుత్వ సొమ్ము ఎంతమాత్రం వుపయోగ పడుతుందో చెప్పాల్సిన పని లేదు. అందువల్ల ఈ విషయాన్ని ప్రభుత్వం గుర్తించి దిక్కుమాలిన నిబంధనలకు తిలోదకాలిచ్చి 60సంవత్సరాలు నిండిన ప్రతి వారికల్లా కొంతమొత్తంలో పెన్షన్ అందజేస్తే చరమదశలో ఆదుకొన్నట్లుంది.

### పశుసంవర్ధక దినోత్సవం

పశు సంవర్ధక దినోత్సవాలను పురస్కరించుకొని అక్టోబర్ నెల చివరి వారంలో రూరల్ మండలంలోని పలు గ్రామాల్లో శిబిరాలు నిర్వహించారు. బ్రహ్మదేవం పశుగణ పర్యవేక్ష కేంద్రం డాక్టర్ వై. రామక్రిష్ణరాజు నాయకత్వంలోని వైద్య బృందం మట్టెంపాడు, మాదరాజ గూడూరు, లింగాయపాళెం, కలివెలపాళెం, కల్లూరుపల్లి గ్రామాల్లో పర్యటించింది. వేలాది పశువులను పరీక్షించి డివార్మింగ్ వ్యాధికి మందులు ఇవ్వడంతో పాటు కృత్రిమ గర్భోత్పత్తి, పశు గ్రాసాభివృద్ధికి గైకొన వలసిన చర్యల గూర్చి ప్రచారం చేశారు.

### కల్లూరు పల్లె నిప్పు

నెల్లూరు రూరల్ మండలం కల్లూరు పల్లిలో గ్రామ కక్షల నిప్పు రాజుకుంటూనే వుంది. సిపిఎం అనుచరులకు, గ్రామ రైతులకు మధ్య ఏర్పడిన వివాదాలు తరచు హింసాయుతంగా పరిణమిస్తున్నాయి. మొన్న 22 తేది మళ్లీ వడ్లపూడి చిన్నయ్య అనే హరిజనుడి పై దాడి జరిగిందట. ఎస్సి, ఎస్టి సెక్షన్ క్రింద రైతుల పై కేసు పెట్టారు. పోలీసులు గ్రామంలోనే కాపురం పెట్టి వున్నారు.

ప్రక్కనే వున్న కనుపర్తిపాడు, దొంతాలి, చవటపాళెం, ఈదగాలి వంటి గ్రామాలలో గ్రామ కక్షల ఫలితంగా కుటుంబాలకు కుటుంబాలే ఎట్లా నాశనమై పోయింది చూస్తూనే వున్నారు. మళ్లీ మూర్ఖంగా కక్షలు పెంచుకొని, హింసకు దిగుతున్నారు. మన రైతులను బాగు చేయడం ఎవడబ్బ తరమూ కాదు.

## పంచాంగము

### విశాఖకార్తె

6 తేది శనివారం విశాఖకార్తె ప్రారంభము

### పండుగలు

12 తేది శుక్ర వారం రాత్రి నరకచతుర్దశి

13 తేది శనివారము దీపావళి అమావాస్య

### ముహూర్తములు

10తేది బుధవారము ఉదయం 10.15గంటలకు ధనుర్లగ్నమున వివాహ వ్యాపారారంభ, గృహారంభ ములకు సుముహూర్తము కలదు

### నవంబరు తిథులు

ఆశ్వీయుజ బహుళ

తే6శని సప్తమి రా.గ. 8.15 వ

తే7 ఆది అష్టమి రా.గ. 6.50 వ

తే8సోమ నవమి సా.గ. 5.10 వ

తే9మంగళ దశమి సా.గ. 3.05 వ

తే10బుధ ఏకాదశి ప.గ. 12.45 వ

తే11 గురు ద్వాదశిప.గ. 10.30 వ

తే12శుక్ర త్రయోదశి ఉ.గ. 8.05 వ

తరువాత చతుర్దశి రా.గ.5.45వ

స్వయంపాకుల శ్రీనివాసులు..



### కావలి డి.ము. కోర్టులో

O.S. No. 165/92

పువ్వాడి చంగయ్య -వాది

షేక్ ఖాజావల్లి, షేక్ ఖాజావల్లి, (S/O. షేక్ వెలగండ్ల యిస్మాయిల్ సాహెబ్) - ప్రతివాది అనువారికి

యీ నంబరున వాది మీమీద దావా చేసినందు మీకు నోటీసు నిమిత్తం 18.11.93 తేదికి వాయిదా వేయబడినది. ఆ రోజున మీకు గల ఆక్షేపణలు తెలుపు కోవలసినది. లేనియెడల మీ పరోక్షమందు తీర్మానించ బడును.

ఎమ్.వి. నారాయణ రావు

వాది అడ్వొకేటు

# పిల్లిమెడకు గంటకట్టేదెవరు?

చిత్ర నిర్మాణ వ్యయం అదుపు చేయడానికి కొందరు నిర్మాతలు ఏవో నిర్ణయాలు హడావుడిగా తీసుకుంటారు. కాని, వాటిని అమలు పరిచేదెవరు? మద్రాసు నుంచి షూటింగ్‌ల నిమిత్తం హైదరాబాద్‌కో, విశాఖ పట్టణానికో వచ్చే నటీ నటులలో యాభై వేల రూపాయలకు పైగా పారితోషికాలు పుచ్చుకొనే వారు. జనవరి నుంచి తమ ప్రయాణపు ఖర్చులను, వసతి సౌకర్యాల ఖర్చులను తామే భరించాలని మూవీ ఆర్టిస్ట్స్ అసోసియేషన్ కార్యవర్గసభ్యులు ఒక నిర్ణయం తీసుకున్నారు. అమలు కావడానికి అసాధ్యమైన నిర్ణయాలు తీసుకోవడ మెందుకు!

## జయచిత్ర దర్శకత్వం

గతంలో జయచిత్ర తమిళంలో ఒక చిత్రానికి దర్శకత్వం వహించింది. అది తెలుగులోకి డబ్ చేయబడింది కూడా. రెండు చిత్రాలూ అంతంత మాత్రంగానే ఆడాయి. ఇప్పుడామెకు తెలుగులో ఒక చిత్రానికి దర్శకత్వం వహించాలనే ఆశ కల్గింది. ఏ నిర్మాత దొరుకుతాడో!

# కాషాయ వస్త్రాలు ధరిస్తే తప్పా?

- తార సితార ప్రశ్న

"అర్థ నగ్నంగా కనిపిస్తే తప్పు. ఒప్పుకుంటాను. మరి పవిత్రమైన కాషాయ వస్త్రాలు ధరించే నన్ను కొందరు ఎద్దేవా చేస్తారేమిటి? నేను నమ్మిన స్వామీజీని పూజిస్తాను. మొదట్నుంచీ నాకు ఆధ్యాత్మిక చింతన ఎక్కువ. అందుకే కాషాయ దుస్తులు ధరించడం అలవాటైంది. అంత మాత్రానికే నేను సినిమా రంగానికి దూరమవు తున్నానంటే ఎలా? ఇది నా వ్యక్తిగత విషయం. కావలిస్తే కెమెరా ముందు జిగేల్ మనిపించే దుస్తులతో నటించడానికి నేను సిద్ధమే" అంటోంది తార సితార.

## మరో వారసుడు

గీతాంజలి, రామకృష్ణల పుత్రుడు శ్రీనివాస్ త్వరలో హీరో అవబోతున్నాడు. "మా ఇద్దరి రక్తం పుణికి పుచ్చుకున్నాడు. నటించాలనే ఆసక్తి వుంది. వాడికి ఒకటి రెండు ఆఫర్లు వచ్చాయి కాని మంచి సంస్థ, మంచి డైరక్టర్ కోసం చూస్తున్నాం" అన్నారు వారు.

## ప్రతాప్ పోతన్ పశ్చాత్తాపం

ప్రతాప్ పోతన్ చాలా విచిత్రమైన వ్యక్తి. మొదట్లో రాధికను వివాహం చేసుకుని, విడాకులిచ్చేశాడు. ఆ తర్వాత దర్శకుడయ్యాడు. ఇతను నిరీశ్వరవాది. ఇటీవల ఇతను

కొరవ 11 పేజీలో

# సుహాసిని సంతోషం

మాతృమూర్తి అయ్యాక తెలుగు, తమిళ చిత్రాలలో నటించిన సుహాసిని ఆ తర్వాత సినిమా ఫంక్షన్లకూ హాజరు కావటం మానేసింది. బహుశా శిశు సంరక్షణలో బిజీగా ఉందేమో? ఈ విషయమే ఆమెను అడిగితే " అదొక కారణమను కోండి. అసలు కారణం నేను స్క్రిప్ట్ పనిలో యమ బిజీగా వుండటం. నా జీవితాశయం త్వరలో నెరవేరబోతుంది. నేను డైరెక్ట్ చేయబోయే చిత్రంలో శివాజీ గణేశన్ గారు నటించడానికి అంగీకరించారు. ఆయనకు కథ బాగా నచ్చింది. ఇంతకన్నా ఆనందం నాకు మరేం ఉంటుంది? " అంది దానిమ్మ గింజల్లాంటి పలువరుసతో నవ్వుతూ.

# బయ్యర్ల చేతిలో నిర్మాతలు బందీలే!

"ఘరానా మొగుడు" "దంట" వంటి రీమేక్ చిత్రాల అఖండ విజయంతో ఎక్కువ మంది నిర్మాతల దృష్టి పరభాషా చిత్రాల మీద పడింది. అలాగని అటువంటి రీమేక్ చిత్రాలన్నీ విజయం సాధిస్తున్నాయా అంటే అదీ లేదు. అందుకని అత్యధిక మొత్తానికి విక్రయించ వచ్చనే ఆశతో కథ, కథనం కన్నా బలమైన సెట్టింగ్‌లు, భారీ కాస్టింగ్‌లకు దుబారాగా వెచ్చిస్తున్నారు. దీనితో చిత్ర నిర్మాణ వ్యయం హద్దు మీరి పోతూంది. నలుగుర్ని పెట్టి ఓ ధనంతిని నిర్మించి, ఆ నలుగురికి డబ్బులు పంచి పెట్టాక తాను మిగుల్చుకునే మూలా మేస్త్రి స్థితికి వచ్చారు నిర్మాత. ఇది చాలక "ఫలానా శృంగార నటీ డ్యాన్సులు ఉండాలి" "ఫలానా హాస్యనటుడి చేత రెండర్థాల మాటలు చెప్పించాలి" అని ఇటీవల కొనుగోలు దారుల డిమాండ్ ఎక్కువైంది. వాళ్లకు తలఒగ్గి, కథలో లింకులు కుదరక, కథకు సంబంధం లేని విషయాలు సినిమాలో అసందర్భంగా చోటు చేసు కుంటున్నాయి. కొనుగోలు దారుల జోక్యం వల్లనే భారత దేశమంతటా మార్కెట్ ఉన్న హిందీ సినిమాలకు మించిన వ్యయం - మన రాష్ట్రం దాటి వెళ్లని తెలుగు సినిమాకు అవుతుంది. అయినా, అందరూ ఎందుకు తప్పటడుగులు వేస్తున్నారు? పేరాశ. కోటి రూపాయలు లాభం తెచ్చి పెట్టిన "చిత్రం భళారే విచిత్రం" నిర్మాతలే తమ తదుపరి చిత్రంలో సంపాదించిన దంతా పోగొట్టుకున్నారు. ఈ విషయాన్ని నిర్మాతలు ఎందుకు గుర్తించరో! అసలు శ్లాబ్ విధానం ప్రవేశ పెట్టిన ప్పట్నుంచీ తెలుగు సినిమా రంగంలో అనారోగ్యకరమైన వాతావరణం నెలకొన్నది అన్నది అందరికీ తెలిసిందే.

తమ పెట్టుబడికి అధిక లాభాలు ఆశించే కొనుగోలు దారుల చేతుల్లోకి వెళ్లి పోయింది తెలుగు చిత్ర పరిశ్రమ. ప్రమాణాలు, విలువలు మంటగలిసి, మంచి సినిమా అడ్రసు లేకుండా పోయింది. దుష్పరిణామాలు గొలుసు కట్టుగా దాపరిస్తున్నాయి. మరో వంక - పదహారు శాతం పన్ను వర్తించే భారీ చిత్రాలు అధికారుల కుమ్మక్కుతో ఎనిమిది శాతంతో నిరాటంకంగా ప్రదర్శింప బడటం వంటి అవినీతి విధానం నిరవధికంగా సాగుతూ, రాయితీలు బూడిదలో పోసిన పన్నీరులా అయిపోతున్నాయి.



అయ్యప్పకరుణ చిత్రంలో శరత్‌బాబు

# ఇళయరాజా జోక్‌వేశా డండోయ్!

ఇది వరకు సినిమా ఫంక్షన్‌లకు హాజరు కాని ఇళయరాజాలో లండన్ నుంచి తిరిగొచ్చాక ఎంతో మార్పు కనిపిస్తోంది. పిలిస్తే చాలు - ఎలాగో వీలు చేసుకుని సభలకు హాజర వుతున్నారు. ఇందుకు ఆశ్చర్య పడని వారు లేరు. పైగా సభల్లో సరదాగా జోక్స్ వేస్తూ, అందర్నీ నవ్విస్తున్నారు కూడా. ఇటీవల ఆయన చెప్పిన ఒక జోక్ ఇది ఒక పాట ట్యూన్ చేయడానికి ముందు ఓ నిర్మాత "మీరు కూర్చబోయే బాణీతో యువతరం మనసులో ఉరకలు వేయాలి" అన్నాడట. అందుకు ఇళయరాజా "మీరు కౌమారదశలో ఉన్న హీరోని బుక్ చేశారు. నేను ఎంత మధురంగా సంగీతమిచ్చినా ఆయన పై చిత్రీకరింప బడే పాట ఎలా యువతరాన్ని ఉరకలు వేయిస్తుంది" అన్నాడట. దాంతో ఆ నిర్మాత నిరుత్తరుడై పోయాడట!

## దాసరి అనుభవసారం రంగరించి తీసిన చిత్రం

# అక్కపెత్తనం - చెల్లెలి కాపురం

**చిత్రసమీక్ష** — గ్రిద్దలూరు గోపాలరావు

"అక్కపెత్తనం - చెల్లెలి కాపురం" అనగానే ఈ చిత్రంలో ఒక అక్క, ఒక చెల్లెలు, ఆ చెల్లెలు భర్త, ఈ మూడు పాత్రలుండి తీరాలి కదా! ఇందులో ఈ మూడు పాత్రలూ దివ్యంగా వున్నాయి.

అక్కపెత్తనం చలాయిస్తుంది కాబట్టి ఆ పాత్ర బలంగా, బడాగా వుండటం సహజం. ఇందులో అక్క రంగనాయికి పాత్ర అలాగే వుంది. చెల్లెలి కాపురంలో పెత్తనం చలాయించిన రంగనాయికి తన కాపురం చక్కదిద్దుకోలేక పోతుంది. తన దాంపత్య జీవితంలో ఓడిపోతుంది. తన భర్త వేరొకరితో సంబంధం పెట్టుకోవటంతో, భర్తతో విడిపోయి తన ఏకైక చెల్లెలు చిన్ని ఇంటికి చేరుతుంది. తన చెల్లెలు సంసారం తన సంసారంలా విచ్ఛిన్నం కాకూడదని చిన్నిని అదుపులో పెట్టమని సలహా యిస్తుంటుంది. ఈ సలహాలు చిన్ని సంసారాన్ని సుఖమయం చేయలేదు సరికదా, తన భర్త సత్యనారాయణను అనుమా నించేంత వరకు దారి తీస్తాయి.

అక్క పాత్ర చిత్రానికి ఆయువుపట్టు. ముఖ్యమైన ఈ పాత్రను జయసుధ గొప్పగా పోషించింది. సంభాషణా తీరు, నటనలో విశిష్టత ఆ పాత్ర రూపాన్ని బాగా పెంచాయి. ఇటువంటి కీలకమైన పాత్రలను మెప్పించటం సులభమైన విషయం కాదు. కాని జయసుధ ఆ పాత్రను సునాయాసంగా రంజింప జేసింది. ప్రేక్షకుల మనసుల్లో హాస్య వల్లరితో, గాంభీర్య సరళితో నిలిచి పోయింది.

అక్క చేతిలో కీలు బొమ్మగా "చిన్ని" పాత్ర పెద్దది కాక పోయినా సంసార ఛిద్రానికి తానూ కారణమ వుతుంది. ఇదీ ప్రమాదకరమైన పాత్రే. తన భర్త సత్యనారాయణ, ఆయన స్నేహితుని భార్య "సోనా" తో అక్రమ సంబంధం వెలగబెట్టున్నాడని అనుమానించి మనో వ్యధతో కృంగుతుంది. సంసారంలో నరకం చూపుతుంది భర్తకు. ఈ పాత్రను అపర్ణ పాత్ర పరిధిలో బాగా చేసింది.

కొరవ 11 పేజీలో

# సంస్మృతి



## ఆరుగుంట దశరథరామరెడ్డి గారు

పరమపదించి 3.11.93 తేదికి రెండు సంవత్సరాలు గడిచింది.

సుఖదుఃఖాలను
సమభావంతో
భగవత్ నిర్దేశితంగా
స్వీకరించి, సంతోషంగా
మనుగడ సాగించాలనే
మా జీవితాదర్శం
మాకు ఆదర్శం కావాలి
ఆశీర్వదించండి!
దీవించండి!!

సంస్మరిస్తూ
కుటుంబ సభ్యులు

## గ్రంథసమీక్ష

(4 పేజీ తరువా)

గురజాడ శ్రీరామమూర్తి 'కవి జీవితములు' (క్రీ.శ 1893) లో కందుకూరి వీరేశలింగం 'ఆంధ్రకవుల చరిత్ర' ద్వితీయ భాగం (1895)లో, చిలుకూరు వీరభద్రరావు 'జీర్ణ కర్ణాట రాజ్య చరిత్ర' (1903) లో, కొమర్రాజు వెంకట లక్ష్మణ రావు 'మహమ్మదీయ మహా యుగము' (1915)లో, వేటూరు ప్రభాకర శాస్త్రి చాటు పద్యమణిమంజరి ద్వితీయ భాగం (1922) లో నేలటూరు వెంకట రమణయ్య 'Studies in the Third Dynasty of Vijayanagara' (1935) లో, వాగంటి శేషయ్య 'ఆంధ్ర కవి తరంగిణి' 7 వ సంపుటం (1950) లో, నిడుదవోలు వెంకట రావు 'అష్టదిగ్గజము' లనే వ్యాసం (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ఉగాది 1955-56 లో, ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం సంపుటం 7లో అష్టదిగ్గజాలను గూర్చి చర్చించి, వారి అభిప్రాయాలు తెలిపి ఉన్నారు.

ఆంధ్రులకు, తెలుగు సాహిత్య చరిత్రకు సంబంధించి నంత వరకు అష్టదిగ్గజ సమస్య - పింగళి సూరన, రామరాజ భూషణుడు, తెనాలి రామకృష్ణుడు అష్టదిగ్గజ కవీశ్వరులలోని వారు కాదా అని పాయసం సుబ్రహ్మణ్యం తన ఈ పరిశోధనా గ్రంథంలో తెనాలి రామకృష్ణ కవి అష్టదిగ్గజ కవి కాడని నిరూపించడానికి ప్రయత్నించి సఫలీ కృతుడయ్యాడు. అష్టదిగ్గజాలు కాకపోయినా, కృష్ణదేవరాయల ఆస్థానాన్ని అలంకరించిన చింతలపూడి ఎల్లన, బొడ్డుచర్ల చిన తిమ్మన, సంకుసాల నృసింహ కవి మొదలైన మరెందరో కవుల వలె - రామకృష్ణుడు కూడా తన యౌవనంలో రాయల ఆస్థానాన్ని అలంకరించి ఉండటానికి అవకాశం ఉంది. ఒక కవి రాయల ఆస్థానంలో ఉండటం వేరు, అతడు అష్టదిగ్గజ కవీశ్వరుడై ఉండటం వేరు. అందువల్లే, పాయసం సుబ్రహ్మణ్యం తన గ్రంథానికి తెనాలి రామకృష్ణ కవి అష్టదిగ్గజ కవా? అని పేరు పెట్టి ఉంటే సమంజసంగా ఉండేదని నా అభిప్రాయం. తెనాలి రామకృష్ణ కవి కృష్ణదేవరాయల ఆస్థాన కవి (అంటే అష్టదిగజమనే అనుకొంటున్నాను) కాడని తెల్పడానికి సుబ్రహ్మణ్యం సాహిత్యాధారాలు, శాసనాధారాలు చక్కగా పరిశీలించాడు. అయితే ఈ విషయాన్ని రుజువు చేయటానికి సుబ్రహ్మణ్యం పేర్కొన్న ఆధారాలలో, ఉపపత్తులలో చాలా వాటిని కందుకూరు వీరేశలింగం తన ఆంధ్ర కవుల చరిత్ర (పు 266-269) లో చూపి ఉన్నాడు. సుబ్రహ్మణ్యం రామకృష్ణ కవి కాలాన్ని మాత్రమే గాక, పింగళి సూరన, రామరాజ భూషణుల కాలాలు కూడా చర్చించి, వారిని అష్టదిగ్గజ కవులు కాదని తేల్చాడు. సుబ్రహ్మణ్యం తాను పరిశీలించిన ఆధారాలనంతా విశ్లేషించి, అష్టదిగ్గజాలుగా వీరిని పేర్కొన్నాడు. 1. అల్లసాని పెద్దన, 2. నంది తిమ్మన, 3. మాదయగారి మల్లన, 4. ధూర్జటి, 5. తిమ్మణార్య కవి (కన్నడ భారత కర్త), 6. బండారు లక్ష్మీ నారాయణ కవి (నాట్యాచార్యుడు - సంస్కృతంలో సంగీత సూర్యోదయ కర్త), 7. బొడ్డుచర్ల చిన తిమ్మన (ప్రసన్న రాఘవ నాటక ప్రబంధ కర్త), 8. చింతలపూడి ఎల్లన (రాధామాధవ కావ్యకర్త) బొడ్డుచర్ల తిమ్మనను చాటువులు అష్టదిగ్గజ కవిగా చెప్తున్నాయని సుబ్రహ్మణ్యం పేర్కొన్నారు. అవి ఏ చాటువులో ఉటంకించి ఉంటే బాగుండేది. 6, 7, 8 కవుల రచనల్లో వారిని అష్ట దిగ్గజ కవీశ్వరులుగా పేర్కొన దానికి కావలసిన గొప్పతనం లేదు. సుబ్రహ్మణ్యం చేసిన అష్టదిగ్గజ కవి నిర్ణయంలోని సమంజత్వాన్ని పాఠకులు గ్రంథాలు చదివి నిర్ణయించుకో గలరు.

పాయసం తన గ్రంథంలో రామలింగడు, రామకృష్ణుడు ఒకే వ్యక్తా, వేరైన వ్యక్తులా అనే సమస్యను కూడా చర్చించారు. పరిశోధకులలో ఎక్కువ మంది ఈ రెండు పేర్లు ఒకే వ్యక్తివని అభిప్రాయ పడ్డారు. సుబ్రహ్మణ్యం వీరు వేరు వేరు వ్యక్తులని నిరూపించ టానికి కృషి చేశారు.

సుబ్రహ్మణ్యం ఒక చోట (పు. 24) "అష్ట భాషా కవి తావాల్ద సంభవులై సుకవి పుంగవులు" అంటే అష్టదిగ్గజ కవులని పొరపడి "అష్టదిగ్గజ కవుల సంప్రదాయం కృష్ణదేవరాయల తండ్రి నరసరాయల కాలాన్నే ఉన్నట్లు చెప్పాడు. అష్టభాషా కవులంటే, మాగధి, శౌరసేని, అపభ్రంశం మొదలగు భాషలు ఎనిమిదింటిలో కవిత్వం చెప్పగల వాడని అర్థం.

తాను చెప్ప దలచుకొన్న విషయానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధమున్న మరికొన్ని విషయాలను (ఉదా. చంద్రగిరి కోట మొదలగునవి) సుబ్రహ్మణ్యం ఆసక్తికరంగా వివరించాడు.

ఆంధ్ర సాహిత్య చరిత్ర కారులు, పరిశోధకుల రచనలలో నూరేండ్లుగా చర్చనీయాంశాలుగా నలుగుతున్న సమస్యలను తనదైన పద్ధతిలో మరలా చర్చించి పాఠకుల దృష్టికి తేవడంలో పాయసం సుబ్రహ్మణ్యం సాహిత్యానికి, సాహిత్య జిజ్ఞాసువులకు మేలు చేశాడు.

తెనాలి రామకృష్ణ కవి శ్రీ కృష్ణదేవరాయల ఆస్థాన కవి కాదు అన్న చరిత్ర పరిశోధనా చర్చ ఆంధ్ర సాహిత్యాభి మానులందరికీ ఆస్వాద యోగ్యమైన చిన్న పుస్తకం.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువా

### చిన చెరుకూరు

టొన్నవాడ దేవాలయంలోకి బ్రతికిన గాడిదలు ప్రవేసిస్తే, ఈ పూరి దేవాలయంలోకి మహిషమయంతో చేసిన పిడకలకుచ్ఛిలే అమాంతంగా ప్రవేసించి తిస్సావేసి కూర్చున్నవి. పెల్లిపిల్లను కాగే చారులోవేసి మూతబెట్టిన కరుణార్థ హృదయులు పూజారులుగా అంగీకరించబడ్డ యీ దినాల్లో దేవాలయాల్లోకి పిడకల కుచ్చెళ్లు వస్తె మాత్రం తప్పేముంది లెండి?

### వెంకటగిరి రాజ్యంలో చెఱువులు విపరీతంగా తెగినవి.

#### మల్లాం చెరువు

7,8 మైళ్ల వలయుంగల యింతపెద్ద చెర్వుకు ఒక్క తూమువుంటే ఒట్టు. అన్ని వాములే (అంటే అవసరమైనప్పుడు కట్టతెగ్గొట్టి పారించుకోవడమే) వరుమానం బోలెడంత.

ఈ చెరువుగూడ మొన్నటి వర్షానికి తెగి 5,6గండ్లు పడ్డాయి. పేష్కారు, తహశీల్దారులతో చెప్పుకుంటే మూగదేముళ్లు.

కలెక్టరు గారూ! తామన్నా గ్రోమోర్‌ఫుడ్ రూపేణామాకు సాయపడండి.

#### ఇస్కూలు

70మంది పిల్లలున్నారు. ధనవంతుల బిడ్డల చదువుకు ఏమీ ఢోకాలేదు. పేద తల్లిదండ్రులు అడిగితే రెండోటీచర్ను తెచ్చుకోమంటారు. మామొహం మేమేంది తెచ్చుకొనేది? జి.బో.ప్రెసిడెంటుదొరా! రెండో టీచర్ను న్నాయిచ్చి మా పిల్లలకు చదువు చెప్పించవా?

-ఒక పేద.

#### నెరికాల్వ తెగింది

"అనంగనంగ రాజుకు యేడుగురు కొడుకులు" అన్నట్లు వెంకటగిరి రాజ్యంలో గూడా ఒక నది, ఆనదికి ఆనకట్ట, ఆనకట్ట వెంబడి కాల్వ, ఈ కాల్వ గూడ 24గ్రామాలకు పారుదల. యివన్నీ చిత్రమైన విషయాలే.

అయితే యీ ఆనకట్టగాని, యీ కాల్వగాని వెంకటగిరి వారి నిర్మాణం కాదులేండి. అంతకు పూర్వమెవ్వరో తిరిపెం జేయించిన బాపు.

ఈకాల్వ రిపేరు చేయటానికి మా ఎస్టేటుకు సొగసక ప్రభుత్వ పత్రికకి నిన్ననేడు కొంతదూరం కొంత మరామత్తు సాగించారు.

ఈ లోపల పైన కాల్వతెగి నీళ్లన్నీ ఏట్లోకి పోతున్నవి. ఈ విషయం ఏ అధికారి తాకించుకోలేదు. అధికాహారోత్పత్తి దేముడెరుగును అసలు ఆహారోత్పత్తి కన్నాలోటు రాకుండా చూడాలంటే కలెక్టరు వారు వెంటనే చర్యబుచ్చుకొని ఈ కాల్వను కట్టించక పోతే 24గ్రామాలు దెబ్బదింటవి. కావున కలెక్టరు వారు ప్రత్యేకాధికారాలతో వెంటనే సరిజేయించ ప్రార్థన.

-ఆ రైతులు

## నెల్లూరు సంగతులు

(4 పేజీ తరువ)

శ్రీ ఆనం సంజీవ రెడ్డి అన్నారు. యువజన నాయకులు దేవకుమార్, సునీల్ కుమార్లు కూడా మాట్లాడారు. బోరున వర్షం; కార్యకర్తల కరవు. ఎస్ శేషారెడ్డి గారు కూడా లేటుగా వచ్చారు. అరగంట వ్యవధిలో సభను ముగించారు.

### కవికోకిల జయంతి

కవికోకిల దువ్వూరు రామిరెడ్డి 98 వ జయంతి సభను 12 తేది వర్తమాన సమాజం టౌన్‌హాల్‌లో నిర్వహించ నుంది. సభాధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డిగారు. మద్రాస్ యూనివర్శిటీ రీడర్ డాక్టర్ మన్నేపల్లి విజయ, కవి శ్రీ నాగభైరవ కోటేశ్వర రావు వుపన్యాసకులుగా విచ్చేస్తారని సమాజం అధ్యక్షులు శ్రీ ఓ.వి. రమణా రెడ్డి తెలుపుతున్నారు.

### ఎం.పి.పి.లో నవంబర్

ప్రభుత్వ వుత్తర్వుల మేరకు అన్ని మండల ప్రజా పరిషత్ కార్యాలయాలతో పాటు నెల్లూరు వారు కూడా రాష్ట్ర అవతరణ దినోత్సవ వేడుకలను నిర్వహించారు. 87 నుండి 93 వరకు మండల ప్రజా పరిషత్ సాధించిన అభివృద్ధి పై ఫోటో ప్రదర్శనను ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి ప్రారంభించారు. మధ్యాహ్నం జరిగిన సభలో మాజీ మండలాధ్యక్షులు శ్రీ టి. రమణయ్య, ఎమ్మార్వో శ్రీవి. నాగరాజ రావు ఇతర అధికారులు ప్రసంగించారు.

### పోలీసులకు పతకాలు

జిల్లాలో ఉత్తమ సేవలందించిన పోలీసులకు ఉగాది పండుగనాడు పతకాలందించడం రివాజు. 89 నుండి ఎందువల్లో ఆ కార్యక్రమం నిలచి పోయింది. 29 తేది పోలీసు వార్షిక క్రీడోత్సవాల ముగింపు సందర్భంగా ఈ కార్యక్రమాన్ని పునరుద్ధరించి అవార్డులను డి.ఐ.జీ. జయచంద్ర ద్వార ఎస్.పి. శ్రీ కృష్ణప్రసాద్ ఇప్పించారు. కోవూరు సర్కిల్ ఇన్స్‌పెక్టర్ కె. రామమోహన రావుతో పాటు ఒకప్పటి సి.సి.ఎస్.ఎస్.ఐ. ఇప్పటి ఐ.డి. పార్టీ ఎస్.ఐ. ఆర్. నాగేశ్వర రావు, ముత్తుకూరు ఎస్.ఐ. ఆర్. మోహన రావు, ఆత్మకూరు ఎస్.ఐ. సుబ్బరామయ్య డి.ఐ.జి. చేతుల మీదుగా అవార్డులు అందుకొన్నారు. దోపిడి ముఠాలను నేరగాళ్లను పట్టుకోవడంలో శ్రమపడ్డ ఐ.డి. పార్టీ కానిస్టేబిళ్లు ఎస్. రాంబాబు, మురళీ ప్రసాద్, టి. సుబ్బారావు, ఎస్.కె. వలీవ్, ఎస్. సుధాకర్, రంగనాయకులు, వి. రమణయ్య, బి. గోపాలయ్య, డి.వి. నాగరాజు, సుకుంభాషా, ఎస్. సాయినాథ్, జిలానీ భాషా, కాలేషా, పి.వి. రమణయ్య, సుబ్బరాజు, శేషగిరి, తిరుపతయ్య, రహంతుల్లా, రామ కోటేశ్వర రావు, వెంకటేశ్వర్లు, రమణయ్య, సూర్యనారాయణ అవార్డులు అందుకొన్నారు. మహిళా కానిస్టేబిళ్లు క్రిష్ణవేణి, సంపూర్ణ, పద్మావతి, ఉమాదేవి, పుష్పవతి, నాగరత్నమ్మ రిజర్వు డ్రైవర్లు సి.హెచ్. వెంకటేశ్వర్లు, మస్తాన్ అందుకొన్న వారిలో వున్నారు.

### పినాకినీ బ్యాంకు అభినందన సభ

పినాకినీ గ్రామీణ బ్యాంకు ఒంగోలు శాఖ మేనేజర్ శ్రీ కె. రాజశేఖర రెడ్డి జాతీయ స్థాయిలో బెస్టరన్ బ్రాంచ్ అవార్డు పొందిన సందర్భంగా అభినందన సభ జరిగింది. 31 తేది హోటల్ శివం కాన్ఫరెన్స్ హాలులో బ్యాంక్ ఆఫీసర్స్ యూనియన్ ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి బ్యాంక్ ఛైర్మన్ శ్రీ ఎ. దక్షిణామూర్తి ముఖ్య అతిథిగా విచ్చేశారు. బ్యాంకులో పని చేస్తున్న సిబ్బంది అవసరమైన అన్ని సౌకర్యాలు కలుగ జేస్తున్నాము. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని సిబ్బంది అంకిత భావంతో పని చేయాలి. వచ్చే సంవత్సరం మళ్లీ అవార్డును పినాకినీ గ్రామీణ బ్యాంకు సాధించేలా కృషి చేయాలన్నారు ఛైర్మన్. నాబార్డు జిల్లా అధికారి శ్రీ రాజోలు రామం, హౌసింగ్ బోర్డు మేనేజర్ శ్రీమతి ఉదయలక్ష్మి, బ్యాంక్ ఛీఫ్ ఇన్స్‌పెక్టర్ శ్రీ డి. ఓంకార్ తదితరులు ప్రసంగించారు. అనంతరం బ్యాంక్ ఛైర్మన్ శ్రీ రాజశేఖర రెడ్డిని సత్కరించారు. ఆఫీసర్స్ యూనియన్ అధ్యక్షుడు ఆర్. ప్రసాద్ ఈ సభకు అధ్యక్షత వహించగా కార్యదర్శి పి.వి రామచంద్రా రెడ్డి వందనాలు చెప్పారు. చివరన బాలరాజు మిమిక్రి కార్యక్రమం జరిగింది.

సినిమా

(9 పేజీ తరువ)

"ఆత్మ" అనే తమిళ చిత్రాన్ని స్వీయ దర్శకత్వంలో రూపొందించారు. అది ఫ్లాప్ అయింది. (అది ఎక్కడ సూపర్ హిట్ అవుతుందోనని ఒక విఖ్యాత తెలుగు డబ్బింగ్ హక్కులను కొన్నారు)దానితో ఆయన నాస్తికత్వం పిల్లిత్తుకుపోయింది. రాత్రికిరాత్రి పరమభక్తుడైపోయారు. "నేను నాస్తికుణ్ని అవటం వల్లే ఆ చిత్రం పోయిందేమో. నా కష్టార్జితంతో కట్టించిన బంగళా కూడా అప్పులకు సరిపోయింది. బాంక్‌లో నా ఖాతా ఖాళీ అయింది.నా ఆత్మకు శాంతి పోయింది" అంటూ పోతన్ ఇటీవల కొండకు వెళ్లి గుండు కొట్టించు కున్నారు. "ప్రతి రోజు దైవన్నామ స్మరణ చేస్తున్నాను. నేను పోగొట్టుకున్న వన్నీ తిరిగి లభించేలా భగవంతుడు చేస్తాడనే నమ్మకం నాకుంది" అన్నారు ప్రతాప్ పోతన్.

చిత్రసమీక్ష

(9 పేజీ తరువ)

ఇక మూడవ పాత్ర సత్యనారాయణ; చిన్ని భర్త. చిన్నిని ప్రేమించి పెళ్లి చేసుకుంటాడు. మంచి భర్త. కాని చెల్లెలి కాపురంలో జొరబడ్డ అక్క పెత్తనం వల్ల స్వర్గమవు తుందనుకున్న సంసారం నరకమవుతుంది. సత్యనారాయణను రోడ్డు ప్రమాదం నుంచి తప్పించ బోయిన అతని ప్రాణ స్నేహితుడు తానే ప్రమాదంలో చనిపోతాడు. స్నేహితుని భార్య సోనాను సోదరి భావంతో చేరదీసి గెస్టుహౌస్‌లో వుంచుతాడు. ఇక చెప్పాలా. అక్క ఎగదొయ్యటం చెల్లెలు భగ్గమనటం, సత్యనారాయణ జీవితం చిటపటా పేలటం. తల్లక్రిందులై పోతాడు సత్యనారాయణ. ఈ పాత్రను రాజేంద్ర ప్రసాద్ చక్కగా పోషించాడు. చిత్రం ప్రథమ భాగంలో చిన్నిని ప్రేమించటం, కీచులాడటం వగైరాలతో సున్నితమైన హాస్యం అందించాడు. ద్వితీయ భాగంలో భార్య అనుమానానికి గురైనప్పుడు బాధ, సంఘర్షణ, కోపం గుంభనంగా ప్రదర్శించాడు. హాస్యరసాన్నే కాదు, నవరసాలనూ ఒలికించ గలనని రుజువు చేశాడు రాజేంద్ర ప్రసాద్.

సోనాది చిన్న పాత్రే. శ్రీ కన్య; ఈ చిన్న పాత్రలో మిన్నగానే కనిపించింది.

ముఖ్యమైన ఈ పాత్రలను కదలించి వాటి చేత నవ్వించి, ఏడిపించి, సూటి పోటి మాటలు చెప్పించి, చెప్పుడు మాటలు వినిపించి, అనుమానించి, కోపగించి, స్వర్గం కావలసిన సంసారాన్ని నరకంచేయించి, చివరన నరకాన్ని స్వర్గంగా మార్పించిన మహానుభావు డొకడున్నాడు. అతను దర్శకుడు దాసరి నారాయణ రావు. ఆయన ఎస్. రవికుమార్ వ్రాసిన మంచి కథను ఎన్నుకొన్నారు. తన అనుభవాన్నంతా స్క్రీన్‌ప్లే మీద కేంద్రీకరించాడు. ప్రతి సన్నివేశంలో తానున్నాన నిపించాడు. చివరన చిత్రాన్ని సుఖాంతం చేసిన పతాక సన్నివేశంలో తన చేవను నిరూపించుకున్నాడు. కోట శ్రీనివాస రావు, బాబూమోహన్ పాత్రల ద్వారానే కాక హీరో హీరోయిన్ పాత్రల ద్వారా గూడా మంచి హాస్యం అందించాడు సంసార సమేతంగా, సున్నితమైన హాస్యపరంగా, సాహాజిక ప్రయోజనంగా, జన రంజకంగా చిత్రాన్ని తీర్చాడు దాసరి.

ఈ విధంగా చిత్రాన్ని తీర్చి దిద్దటంలో తమవంతూ వున్నదని కాశీ విశ్వనాథ్ వ్రాసిన మాటలు వాదించాయి. వాటి వాదన యదార్థం. ఇది విన్న వాసూరావు సంగీతం "చెవిలో చెప్పాలి ఓ చిన్న మాట" - వంటి పాటలతో నేనూ ప్రేక్షకులకు వీనుల విందు చేశానని ముందు కొచ్చి నిలచింది. నేనేమీ తక్కువ కాదు, నా ప్రమేయం లేకపోతే ప్రేక్షకులు అసలు సినిమా చూడలేరు అంటూ నాగేంద్రకుమార్ కెమెరా. తాను రూపొందించిన దృశ్యాల్లోని రమణీయతను చూపింది.

జనవాణి

(3 పేజీ తరువ)

భావములను. అనే పద్యానికి అర్థం చెప్పలేక మరో పండితుడు గౌడ డిండిమ భట్టు చేతులెత్తేసినట్లు చూపించారు. కాని ఇదే పద్యాన్ని ఎన్నో ఏళ్లు ముందుగా తీసిన తెనాలి రామకృష్ణ చిత్రంలో కొండవీటి సీమ నుండి వచ్చిన ఒక పండితుడు శ్రీకృష్ణ దేవరాయల భువన విజయంలో వినిపిస్తే, ఆ సభలోని తెనాలి రామలింగ కవి దాన్ని చెత్తగా కొట్టి వేయడంగా చిత్రీకరించ బడింది. ఈ రెండు సినిమాల్లోని పద్యాలలో ఏది సరియైనదో పండితులు వివరణ ఇచ్చి సాహిత్యాభి మానులను సందేహ నివృత్తి చేయవల్సిందిగా కోరుచున్నాను.

తడ - వి. రామచంద్ర రావు

### పద్యాలు పాడలేక పోయాడు

శ్రీనాథ కవి సార్వభౌమ చిత్రంలో ఎన్టీఆర్‌తో వదిలేస్తే అందరూ అతిథి నటులే. చిత్రానికి ప్రాణమైన పద్యాలను శ్రవణానందంగా పాడడంలో ఎస్పీబాలసుబ్రహ్మణ్యం విఫలమయ్యాడు. అమర గాయకుడు ఘంటసాల లేని లోటు స్పష్టంగా కనపడింది. మధుర కంఠాలతో పద్యాలు లేనప్పుడు పౌరాణిక చిత్రాలు తీయడం దండగ.

-పి.ఎన్. అప్పారావు

నెల్లూరు పి. రవికుమార్

### అధికారుల తీరు

నేను చెవిటి విద్యార్థిని ప్రస్తుతం ఐ.టి.ఐ. చదువుతున్నాను. క్లాసులో బొత్తిగా వినపడక నరకయాతన పడేవాడిని. దీనికి తోడుగా పేదరికం. నేను పడుతున్న బాధను పలుసార్లు నెల్లూరులోని వికలాంగుల సంస్థ అసిస్టెంట్ డైరక్టరు గారికి విన్న వించుకోగా ఎలాగోలా దరఖాస్తు మాత్రం ఇచ్చారు. దాన్ని పూర్తి చేసి ఇచ్చి 45 రోజులు గడిచినా సమాధానం రాక పోయేసరికి కలెక్టర్ గారిని కలిశాను. ఆయన మాత్రం 15 రోజులలో శ్రవణ యంత్రం తీసివ్వమని రాస్తూ మళ్లీ అసిస్టెంట్ డైరక్టర్‌ను కలువ మన్నారు. అక్కడకు పోగా యథా ప్రకారంగా పలుమార్లు తిప్పుకొని తిరుపతికి వెళితే శ్రవణ యంత్రం ఇస్తారని ఒక వుత్తరం రాసి ఇచ్చారు. ఛార్జీకి డబ్బులు లేక అప్పు చేసి పోగా అక్కడ పరీక్షించిన డాక్టర్4500 కడితే శ్రవణ యంత్రం ఇస్తామన్నారు. ఈ విషయాన్ని తిరిగి ఇక్కడ అధికారులకు వివరించగా విని వుత్తరం రాసివ్వడమే మా పని అని పూరుకొన్నారు. వికలాంగులను ఆదుకొంటున్నామని మాటలు చెప్పడమే గాని ఆచరణలో ఎలా చేస్తున్నారో చూడండి. దయచేసి ఏ అధికారియైనా కరుణించండి.

నెల్లూరు -కె. వెంకటేశ్వర్లు

### పోస్టల్ తెలివి

నెల్లూరు స్టోన్‌హౌస్‌పేట నుండి బట్వాడా అయ్యే జాబుల మీద పోస్టల్ ముద్ర వేయడం లేదు. కారణం వారికే తెలియాలి. ముద్ర వేస్తే డెలివరీ ఆలస్యమైతే ఆడుగుతారని తెలివి ప్రదర్శిస్తున్నారు.

నెల్లూరు -టి.వి.నారాయణ

### విశ్వనాథ్ దర్శకత్వం విడనాడకూడదు!

ఇటీవల జమీన్‌రైతులో సినిమా దర్శకులు కె. విశ్వనాథ్ దర్శకత్వం వహించను విముఖత చూపుతున్నారన్న విషయం చదివి ఆశ్చర్య పోయాను. ఆయన అద్భుత కళాస్రష్ట. శంకరాభరణం, స్వాతిముత్యం, స్వాతికిరణం, సిరివెన్నెల చిత్రాలు చూస్తుంటే విశ్వనాథ్ గారి దర్శకప్రతిభను విమర్శకులు సైతం ప్రశంసించక మానరు. సిరిమువ్వల సింహనాదం విడుదల కాక పోవడం, స్వాతికిరణం ఆర్థికంగా విజయం సాధించక పోవడం వల్ల కృంగిపోయారనిపిస్తుంది. కుటుంబసమేతంగా చూడతగ్గ సినిమాలు తీసే దర్శకులు ఇటువంటి నిర్ణయం తీసుకోవడం బాధాకరం. ఆయన మరోసారి ఈ విషయమై ఆలోచించాలని మనవి.

నెల్లూరు -ఎ.వరలక్ష్మి

### వేమారెడ్డి, యానాది రెడ్డి లడాయి ముదిరి పాకాన బడింది!

# సహకార శాఖ వూడబెరకమని సిఫార్సు!

జిల్లా మంత్రి కలికి యానాది రెడ్డి, జిల్లా కేంద్ర సహకార బ్యాంక్ అధ్యక్షుడు వేమారెడ్డి రామచంద్రా రెడ్డి మధ్య గొడవ ముదిరి పాకాన బడింది. ఆ మధ్య నెల్లూరులో గెస్టుహౌస్‌లో వీరిద్దరి మధ్య జరిగిన గొడవ అప్పుడు హైదరాబాదులోని ముఖ్యమంత్రి దాకా వెళ్లింది. వేమారెడ్డి, యానాది రెడ్డి ఇద్దరూ సహకార గొడుగు కిందే ఉండటం వల్ల దానికి సంబంధించిన లావాదేవీలు కూడా వీరిరువురి మధ్య అడ్డం పోశాయి.

యానాది రెడ్డి సహకార శాఖకు న్యాయం చేయలేక పోతున్నాడని, కీలకమైన ఈ శాఖను మరొకరికి అప్పగిస్తే బాగుంటుందని వేమారెడ్డి ఇటీవల ముఖ్యమంత్రిని కలిసి విన్నవించారట. ముఖ్యమంత్రి దగ్గర వేమారెడ్డికి చొరవ వున్న కారణంగా ఆయన "చెప్పేదంతా" ముఖ్యమంత్రి విజయ భాస్కర రెడ్డి శ్రద్ధగా విన్నారట. ఈ సంగతి తెలిసిన దగ్గర నుంచి పాపం యానాది రెడ్డి గారికి టెన్షన్ పెరిగి పోయినట్లుంది.

మహారాష్ట్ర భూకంప బాధితుల సహాయార్థం జిల్లా సహకార బ్యాంకుల తరఫున 20 లక్షల రూపాయల చెక్కును ముఖ్యమంత్రికి సమర్పించేందుకు ఆయా సహకార బ్యాంకుల అధ్యక్షులు మంత్రి గారిని కూడా పిలిచారట. ఇది తన శాఖకు సంబంధించిన వ్యవహారం కాబట్టి ఈ విషయాన్ని తనకు కొస్తంత ముందుగానే చెప్పి వుండాల్సిందని చిరాకు పడ్తూ మంత్రి గారు వాళ్ల వెంట ముఖ్యమంత్రి నివాసానికి వెళ్లారు. నెల్లూరు జిల్లా బ్యాంకు తరఫున వేమారెడ్డి కూడా ఆ బృందంలో వున్నారు. ముఖ్యమంత్రిని కలుసుకొని చెక్కు సమర్పించిన తర్వాత గ్రూపు ఫోటో కోసం అందరూ ముఖ్యమంత్రి చుట్టూ చేరారట. అయితే మంత్రి మాత్రం వెనుకబడి పోయాడు. ముఖ్యమంత్రి కూడా యానాది రెడ్డిని పిలిచి పక్కన నిలబెట్టు కోలేదు. దాంతో గ్రూపు ఫోటోలో మంత్రి గారు కనుమరుగై పోయారు. జిల్లాకు చెందిన వేమారెడ్డి, -జౌళి సంస్థ అధ్యక్షుడు పూసల రంగయ్య మాత్రం ముఖ్యమంత్రితో పాటు ఫోటోలో బహు చక్కగా పడ్డారు. తెల్లారే సరికి ఈ ఫోటో ప్రముఖ పత్రికలన్నింటిలో దర్శనం ఇచ్చింది. పాపం మంత్రి గారు మినహా అందరూ ఫోటోలో కనిపించారు. ముఖ్యమంత్రి దగ్గర యానాది రెడ్డి గారి స్థానానికి ఈ ఫోటో సింబాలిక్ కాదు గదా? ఏదైతేనేం వేమారెడ్డి, యానాది రెడ్డి మధ్య అప్పుడు మునుపటి అప్యాయత కరువైంది.

నిన్న మొన్న దాకా సఖ్యంగా వున్న వీరిద్దరి మధ్య హఠాత్తుగా గొడవ రావడానికి వెనుక వున్న రహస్యాన్ని మంత్రి గారు తన సన్నిహితుల వద్ద బయట పెడ్తున్నారు.

వేమారెడ్డి రామచంద్రారెడ్డి కుమారుడు పెట్టబోయే ఒక పరిశ్రమకు రాష్ట్ర సహకార బ్యాంకు అందిస్తుండిన "సహకారానికి" తాను మోకాలడ్డు పెట్టానన్న కక్షతో వేమారెడ్డి ఈ విధంగా తన పై కత్తి కట్టాడని మంత్రి గారు వాపోతున్నట్లు వినికిడి.

## తెలుగుదేశంలో చిగురించిన ఆశలు-
## కాంగ్రెస్ ఎన్నికల జిమ్మిక్కులు!

ప్రకటించే టప్పుడు కూడా ముఖ్యమంత్రి స్వోత్కర్షగా వ్యవహరించడం చాలా మందికి బాధ కలిగించింది. రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఇవన్నీ చేస్తోంది. మా ప్రభుత్వం సాధించిన ఘనకార్యాలివి అని ముఖ్యమంత్రి చెబితే బాగుండేది కానీ నేను ఇవన్నీ చేస్తున్నానని గర్వంగా చెప్పడం గత ముఖ్యమంత్రుల్ని తక్కువ చేయడం కాదా? ఎటొచ్చీ కోట్ల వారు ప్రకటించిన వరాల్ని గత ముఖ్యమంత్రులు కూడా చాలా వరకు వల్లెవేశారు. ఏదైతేనేం రాష్ట్ర ప్రభుత్వం తరఫున రాజధానిలో పెద్ద షో

**ఇరు పక్షాలూ**
(మొదటి పేజీ కొరవ)

ఏర్పాటు చేసి ఘనకార్యాల్ని వాటి చెప్పుకోవడంలో కోట్ల వారు కృతకృత్యులయ్యారు. తెలుగుదేశం ఫార్టీపీటు సభకు పోటీగా జన సమీకరణ చేయలేక పోయినా ఆడంబరం, ప్రచారం అలంకరణలో మాత్రం సర్కారు సభ సూపర్‌హిట్టైందని చెప్పాలి. సుమారు కోటి రూపాయలకు పైగా సభకోసం ఖర్చుపెట్టారు. ఇంతా చేస్తే సాధించిందేమిటన్నదే ప్రశ్న.

**జలగం**
(మొదటి పేజీ కొరవ)

విరమించుకొని విశ్రాంతి తీసుకుంటున్న వెంగళ రావు తన నిర్ణయాన్ని పునః పరిశీలిస్తున్నాడట. ఇదే నిజమైతే కోట్ల పై కోపంతో ఆయన తిరిగి క్రియాశీలక రాజకీయాల్లోకి రావచ్చు. అప్పుడు రాష్ట్ర పరిస్థితి మరోలా వుంటుందని వేరే చెప్పాల్సిన పని లేదు.

గతంలో కనుమూరి బాపిరాజుకు కూడా షోకాజ్ నోటీస్ జారీ చేసినా ఇంత వరకు చర్య తీసుకోలేదు. కానీ ప్రసాద్ విషయంలో మాత్రం ఏదో ఒక చర్య తప్పదని అంటున్నారు.

**జమీన్‌రైతు**
సంవత్సర చందా రు 100/-
6 నె లలకు- రు.50/-
విడిప్రతి - రు. 2.00









Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.